# మా వ్యాసకర్తలు

ములుమూడి ఆదిశేషాద్రిరెడ్డిగారు: వీరిది కమ్మనికవిత్వం. కవితాత్మగల నిరాడంబరులు. హృదయమిచ్చి హృదయం [illegible]గల స్నేహితులు.

... ... ...

పమ్మి రామశాస్త్రిగారు: యువకులు. పల్లెటిపట్టున ప్రాథమికపాఠశాలలో పా[illegible]యులు అయివున్నా సంస్కార[illegible]. గ్రంథాలయోద్యమాభిమా[illegible]శేషించి మంచికథకులు.

... ...

[illegible]త్తిలి సూర్యనారాయణమూర్తి [illegible] భీమవరం నివాసులు. రవీంద్ర[illegible]స్వతసమాజస్థాపనాచార్యులు. [illegible]వరంలోని అన్ని ఉద్యమాలకీ పట్టు[illegible]మ్మ. హృదయం స్నేహపిచ్ఛలమైంది.

... ... ...

క. [illegible] రామమూర్తిగారు: మద్రాసు [illegible] మెంటు స్కూలుఆఫ్ టెక్నాలజీ విద్యను అభ్యసించి ప్రశంసతో [illegible]ల్. యమ్. ఇ. డిప్లొమాను పొందిన[illegible]రు. కార్యదీక్ష కార్యశ్రద్ధగల యువకులు. ఆంధ్రాభిమానం హెచ్చు.

... ... ...

జంధ్యాల జానకిరామయ్యగారు: హిందీప్రచారకులు. రాజమండ్రిలోని [illegible]రి సుబ్బమ్మగారి పాఠశాల్లో కొంతకాలం ఉపాధ్యాయులుగా వున్నారు. గృహలక్ష్మి, శుభోధిని, స్వతంత్ర మొదలగు పత్రికాకార్యాలయాల్లో కొద్దికొద్ది కాలం వుండినవారు. నివాసం నెల్లూరు.

... .. ...

గొరావఝుల వెంకటసుబ్బరామయ్యగారు: హిందీప్రచారకులుగావున్న ఆంధ్రాభిమానులు. సంభాషణ హాస్యవర్ధకంగా వుంటుంది. తండ్రి హరికథలు చెప్పడంలో ప్రజ్ఞాశాలి.

శ్రీ బహుధాన్య సంవత్సరము
ఆంధ్రభూమి చందాదారులకు, పాఠకులకు
శుభప్రదము, సుఖప్రదము అగునట్లుచేయ
పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

వేపేరి, మదరాసు. } సంపాదకుడు. 1-4-1938.

## విషయసూచిక

# మీరు చూడవలసిన మా జాబులు

ప్రియ పాఠక మహాశయులారా!

మార్చి సంచికలోని వ్యాసములనుగూర్చి మీలో కొందరు లేఖామూలమున తెలిపిన కొన్ని భావములను ఇచట ప్రదర్శించుచున్నాము. ఇట్లే ఈ సంచికలోని వ్యాసములను గూర్చి అనుకూలమైనవిగాని ప్రతికూలమైనవిగాని అయిన మీ అభిప్రాయములను ఏమైన చెప్పదలచినచో లేఖామూలమున మాకు తెలియజెప్పుడు. పై మాసపు ఆంధ్రభూమి ముఖమున వానిని ఆంధ్రలోకమును అందజేయుదుము. మీయింగితము మాకును, మావ్యాసకర్తలకును చుక్కానివంటిది.

—సంపాదకుడు.

౧

'...మార్చిమాసపు ఆంధ్రభూమిలో, కె.రామమూర్తి యల్, యమ్, ఇ. గారి, 'సినీమాల్లో శ్రీకృష్ణుని చిల్లరరూపాలు' అను వ్యాసము చాల బాగున్నది. ఇటువంటి ఇతర సినీమాఅవతారాలనుగురించి, వ్రాసినను బాగుండును. మన తెలుగుటాకీలు చాలవరకు వెనుకబడి, యిట్టి దుర్గుణములచే నిండియున్నవి. మీపత్రికలో మునుపు 'కారపుశనగలు' అనెడి శీర్షిక క్రింద వచ్చుచుండెడి అంశములు నిజముగానే కారమవుచుండెను.

మీ పత్రికయందు వచ్చుచున్న 'జిజ్ఞాస: మీమాంస' భాగము అందరికి వుపయుక్తముగానుండునట్లు తోచుచున్నది. ఇటువంటి ప్రశ్నలు తరచుగా వచ్చుచుండిన చాల బాగుండును.

పాఠకుల లోకజ్ఞానము పరిశీలించుటకు మీపత్రికయందు ప్రతిమాసము కొన్నిప్రశ్నలు మనదేశము ననుసరించినవియు, సాధారణముగా లోకమునందు నిత్యము జరిగెడి విషయములను గురించినవియు, ప్రచురించి వాని ప్రత్యుత్తరములను పాఠకులను గ్రహింపమని, వారగ్రహింపులు సరిగా నున్నవియో లేవో తెలుసుకొనుటకు మీరు వాటికి సరియైన సమాధానములను పైమాసపుసంచికలో ప్రచురించిన బాగుండును.

మరియు, మన తెలుగుజిల్లాలలోని ముఖ్యపట్టణముల చరిత్రములను, వాటి ప్రాముఖ్యతను క్లుప్తముగా ప్రతిమాసము ఒక్కొక్క పట్టణమునుగురించి వ్యాసములు ప్రచురించిన చాల బాగుండును.'

—సర్వేపల్లి కృష్ణమూర్తి, బి.కాం.

౨

'ఆంధ్రభూమియందు కొలదిమాసములనుండి మాసమున కొకక్రొత్తతీరు చక్కదనము గోచరించి నాకమేయానందమును కల్గించుచున్నది. తిరిగి నూతనపల్లవములతోడను, భావసౌరభములగుబాళించు వ్యాసములతోడను ఆంధ్రభూమి యలరుచున్నది.'

—శివరామకృష్ణప్రసాద్.

౩

'..మార్చిసంచికలో మూడుకాలంలపద్ధతి అవలంబించారు. ఎంతో బాగావుంది. ఎక్కువ మేటరుపట్టడం, తక్కువకాగితం రద్దుపోవడం అనే సౌకర్యాలేకాకుండా పత్రికకు ఒకవిధమైన కొత్తఅందమున్నూ వచ్చింది. ఈసైజులో ప్రకటింపబడే మరిఏ తెనుగుపత్రికకున్నూ ఈఅందం లేదంటే మీరు నేను పొగడి చెబుతున్నానని అనుకోకూడదు...'

—తోలేటి గోవిందం.

౪

'...మీ మార్చిసంచికలో మొదటి వ్యాసంగా ప్రచురింపబడ్డ 'హరిపురములోని అపూర్వమైన హరిన్మణులు' అనే వ్యాసంయొక్క పద్ధతి నిజంగా అపూర్వమైందిగానేవుంది. మీరు వివిధపత్రికల్లోంచి ఎంచితీసిన వ్యాసఖండాలు కాంగ్రెస్‌కథని సూక్ష్మంగా చెప్పేస్తున్నాయి. పెద్దపెద్ద కాన్ఫరెన్సులు జరిగినపుడు పాశ్చాత్యమాసపత్రికలు దినపత్రికల్లోంచి ఇల్లాగే భాగాలుఎంచి ఏర్చి ప్రకటించి కాన్ఫరెన్సుకథని చెబుతాయి. మీ రీపద్ధతి తెనుగులో అవలంబించినందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను.'

—పక్షుల సాగరం.

౫

'...పిల్లలు పుడితేకాని పెళ్ళికాదు' అనే శీర్షికతో మనఆంధ్రభూమి ఫిబ్రవరిసంచికలో నేను వ్రాసిన వ్యాసాన్ని నెల్లూరులోని ప్రజాసేవపత్రికా, హైదరాబాదు గోలకొండపత్రికా ఎత్తి ముద్రించుకొన్నాయని మార్చిసంచికలోని 'మీరు చూడవలసిన మాజాబుల'వల్ల తెలుసుకుని సంతోషించాను. కాని ఒకసంగతి. బళ్ళారిలో ప్రచురింపబడే ప్రతిభ వారపత్రిక 11-3-38 నాటి సంచికలో 'పెండ్లిండ్లరకములు' అనేశీర్షికతో ఆంధ్రభూమిలోని నావ్యాసంలోనుంచి అక్కడక్కడ వాక్యాలుతీసి ప్రచురించారు. నాపేరుకాని, మనపత్రికపేరుకాని లేదు సరికదా దిగువను 'జమీనురైతు' అని ఉదాహరించారు. బహుశా మనపత్రికలోంచి ఈవిషయాలు జమీన్‌రైతువారు ముందు తీసివుండాలి. అయితే వారు మనపేరు తడవలేదా? దయచేసి విచారించండి. పర్యవసానం నాకు తెలుపుతారని నమ్ముతాను.

—ఆర్. శ్రీరామమూర్తి.

ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు

సచిత్రాంధ్ర మాసపత్రిక.



స్థాపితము ౧౯33.

సాలుచందా 1-8-0.

సంపాదకుడు :

ఆండ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట : ౬. బహుధాన్య, చైత్రము : ఏప్రెల్, 1938. సంచిక : ౯.

# ఈశ్వరసంవత్సరపు తెలుగువారి ఇంటిసంగతులు

ఈశ్వరసంవత్సరాది 1937 ఏప్రెల్ 12-వ తేదీని. నాటికి పండ్రెండురోజులకు పూర్వమే ఏప్రెల్ 1-వ తేదీనుండి మనకును, బర్మాయందలి మన ఆంధ్రసోదరులకును హెచ్చు పోస్టల్ రేట్లు అను గోడ కట్టబడినది.

ఈశ్వరారంభమున సర్ కూర్మా మద్రాసు ప్రధానిమైయుండినను అది ఆంధ్రులకు ముదముగూర్చు విషయము కాకపోయినది.

జూలైలో కాంగ్రెస్‌వారు మంత్రిపదవులు స్వీకరించిరి. ఆదిలో అమితోత్సాహము కలిగినది. క్రమముగా చప్పబడిపోయినది. మంత్రివర్గములో ఆంధ్రులకు తక్కువ స్థానములుండుట, రాయలసీమకు అసలే స్థానములేకపోవుట ఈ ఉత్సాహభంగమునకు మొదటికారణము.

ఇది చాలనట్లు మంత్రులు, బాధ్యతులు ఆంధ్రరాష్ట్రవిషయమున ప్రాతికూల్యము వహించిరి. ...కరు సాంబమూర్తి రాష్ట్రము వద్దనుట, అలీబేగ్‌గారి కోతప్రతిపాదనసందర్భమున ప్రధానమంత్రి ఆంధ్రరాష్ట్రవిషయము అప్రస్తుతమనుట ఆంధ్రులకు కొరడాదెబ్బలై బెజవాడలో అక్టోబరులో ఆంధ్రమహాసభను చల్లపల్లి రాజావారి తోడ్పాటున అత్యంతవైభవముగా జరిపించునట్లు చేసినవి. అనంతరము సర్కారులకు, రాయలసీమకు శ్రీబాగ్ ఒడంబడిక సామరస్యము కుదిర్చినది. అయినను తరువాతి ఈశ్వరవత్సరచరిత్ర ఆంధ్రరాష్ట్రవిషయమున అంత ఆశాజనకముగ నుండలేదు.

ఈశ్వరలో ఆంధ్రవిద్యార్థులందు పలుతావులలో సమ్మెలు రేగినవి. ఆంధ్రకార్మికుల స్థితియు ఇంతింతగా నేయుండినది.

ఈశ్వరారంభమున కొత్తపట్టణము రాజకీయపాఠశాలలో నడచిన అరెస్టులు, లాఠీదెబ్బలును— వత్సరాంతమున చీరాలలో జరిగిన కాల్పులును ఆంధ్రులకు మనశ్శాంతిలేకుండ చేసినవి.

ఆంధ్రులు ఈశ్వరలో తలపెట్టిన బర్మాయందు ఆంధ్రాహైస్కూలు నిర్మాణముకాని, ఇచట కాశీనాథుని నాగేశ్వరరావుగారి సన్మానముకాని నెరవేరలేదు.

ఈశ్వరలో ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు కొన్నిభూరివిరాళములు లభించుట మోదావహముగుసంగతి.

తెలుగుటాకీ లోకమున ఈశ్వర కొంత అభివృద్ధిని చూపినది. 'మోహినీరుక్మాంగద', 'చిత్రనళీయము', 'కృష్ణజరాసంధ' అను చిత్రములు ప్రజామోదమును చూఱగొని పౌరాణికచిత్రములకు ఇంకను కాలముండుటను చూపినవి. ఈ ఈశ్వరాంతమున 'బాలయోగిని', 'గృహలక్ష్మి' అను రెండుసాంఘిక చిత్రములు విడుదలనొందినవి. ఇందు 'బాలయోగిని' గూడవిల్లి రామబ్రహ్మముగారి యాజమాన్యమున తయారై అభిజ్ఞుల మన్ననలను విశేషముగ నందినది.

ఈశ్వరలో ఉపజ్ఞామహి... ఒక్క పుస్తకముకూడ వెలువ...

లేదని చెప్పవలసియున్నది. తెనాలి యువకార్యాలయమువారు చిన్న కథల సంపుటముల ప్రచురణవిషయమున శ్లాఘాపాత్రమైన పని చేసిరి. వారు ప్రచురించిన 'స్వాగతం' అను కథలసంపుటి వాఙ్మయమున ఉన్నతస్థాన మందదగినది. నమ్మాళ్వార్సు ప్రకటనకర్తలుగా ఆంధ్రులకు ఈశ్వరలోనే దర్శనమిచ్చి క్రొత్తరూపముతో కొన్ని గ్రంథములు ప్రచురించిరి.

వారపత్రికలకు ఈశ్వర శుభప్రదముగానుండినది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి సేవాభాగ్యమునంది ఆంధ్రవారపత్రిక అలరారుచున్నది. విదేశరాజకీయములను వివరించుటయందు 'ప్రజామిత్ర'యు, ఆంధ్రవ్యవహారములను అభిదర్శించుటయందు 'ప్రజాబంధు'ను అతిశ్రద్ధను చూపుచున్నవి. తనకు ప్రత్యేకతనుగూర్చిన సంపాదకీయ వ్యాసములప్రత్యేకతను 'కృష్ణా పత్రిక' నిలుపుకొనుచున్నది. మద్దూరి అన్నపూర్ణయ్యగారి సంపాదకత్వమున వెలువడుచున్న 'నవశక్తి' పుట్టుక ఈ ఈశ్వరలోనే. పుట్టిన కొలదిరోజులలోనే అది విశేషప్రచారమందినది.

మాసపత్రికలకు ఈశ్వర మంచిదిగా నుండలేదు. విశేషప్రచారమున్న 'వినోదిని' చేతులు మారినది. పలుమాసపత్రికలు ప్రచారమునే మానినవి. 'నవ్వులరాణి' కొంతకాలమాగిపోయి మరల వచ్చుచున్నది. మాసపత్రికలకు మాణిక్యమైన 'భారతి' పదునాలుగేండ్లు నిండుటచే ఆకృతిలో పెద్దదై నూత్నసంస్కృతినంద ప్రయత్నములు సాగించినది. ఈశ్వరలో 'ప్రబుద్ధాంధ్ర' తిరిగి ప్రచారమునకు కడంగుట విశేషము. యస్.జి. ఆచార్యగారి విశిష్టపరిశీలనమున 'చిత్రగుప్త' మాత్రము యథారీతిని, యథాభిరుచితో వెలువడినది.

ఈశ్వర బుర్రా సత్యనారాయణ, నెమిలి పట్టాభిరామారావు, కోడి రామమూర్తినాయుడు, వడ్డాది సుబ్బారాయుడు, వల్లూరి సూర్యనారాయణరావు, కట్టమంచి కోళందరెడ్డి మున్నగు పెద్దలనేగాక మున్నంగి శర్మ, కొంపెల్ల జనార్దనరావు మున్నగు యువకులనుకూడ తనపొట్టను పెట్టుకున్నది.

ఈశ్వరసంవత్సరపు వింతలలో తెనాలి బ్రాహ్మణేతరకవిసమ్మే[ళ]నము, పిఠాపురము ట్రంకుహా[ల్] కేసు, ఆంధ్రనాటకకళాపరిష[త్తు] వారు తమకువచ్చిన నాటకములల[ో] ఒక్కటికూడ బహుమానార్హ[ము] కాదనుట పేర్కొనదగినవి.

ఈశ్వరలో విశేషఖ్యాతినంది[న] ఆంధ్రనాయకులలో పట్టాభిగా[రు] మొదటివారు. సంస్థానప్రజల [...] సభాధ్యక్షులై దేశముతిరిగినా[రు]. మదరాసులో అపూర్వసన్మానమం[ం]దినారు. వారిని కాంగ్రెస్ కార[్య]సంఘసభ్యులుగాచేసి ఈశ్వర మ[న]కు ప్రియకరమైనది.

నిన్నటితో ఈశ్వర వీడ్కో[లు] అందినది.

నేడు ప్రారంభమైన బహుధాన్యకు ఆంధ్రభూమి ఇందుతో స్వా[]గతోపచారములు చేయుచున్నది.

---

# ప్రేమజీవనము

ములుమూడి
ఆదిశేషాద్రి రెడ్డి

పారుమేఘాల వెంబడి పరువులెత్తు నా
భావాలలోన శం
పాలతల్ పొడసూపి,
    మెరసి నా జీవితమె
    పురపించివైచినవి ;

ఈయనంతప్రకృతి
నేమి ప్రేమింతునో
నాయెడంద వెలుంగు
నన్నె ప్రేమింతునో
    ప్రేమించు ప్రేయసీ
    ప్రేమనే ప్రేమింతు ,

మేఘాల తెరజార
మిరుమిట్లుగొల్పు ఆ
మిహికాకరుని కాంతు
మెయి, గని తలపులూర
    ప్రేయసీ! యనిపిల్చి
    ప్రేమించి జీవింతు ;

ప్రేమమయు డీశ్వరుడు
ప్రేమమయ మీప్రకృతి
ప్రేమమయ జీవనము
ప్రేమమయ ప్రేయసీ
    ప్రేమను ఉపాసించి
    ప్రేమలో జీవింతు.

# తాతలనాటి బహుధాన్యలో ఆంధ్రదేశస్థితి

## వినదగిన ఆనాటి కొన్ని విశేషాలు

చింతపండుమీద పన్ను—
హిందూ ధర్మాదాయాల బిల్లు—
రెండు సారులు తుపాను—
నల్లమందు అమ్మకాన్ని గూర్చి చట్టం—
వర్తకులందరిమీదా లైసెన్సు పన్ను—
అమరావతి విగ్రహాలు మద్రాసు మ్యూజియమ్‌కు—
ప్రచురితమైన తెనుగు గ్రంథాలు 109 మాత్రమే—

అరవై యేళ్ల క్రిందటి బహుధాన్య సంవత్సరానికి సరియైన ఆంగ్లసంవత్సరం 1878-79. ఫసలీ 1287.

... ... ...

అప్పుడు డ్యూక్ ఆఫ్ బక్కింగ్‌హ్యామ్ మదరాసుగవర్నరు. ధాత కరవు తీవ్రత కొంతతగ్గడంచేత వేసవిలో గవర్నరు ఉదకమండల యాత్ర సేవించాడు.

... ... ...

ధాతలో ప్రారంభించిన కరువు ఇంకా ఈసంవత్సరంకూడా నెల్లూరు, కడప, బళ్లారి, కర్నూలుజిల్లాల్లో వుండెను.

... ... ...

గంజాము ఏజెన్సీలో అకాల వర్షాలు, పురుగులు బయలుదేరి పంటల్ని నాశనంచేశాయి. విశాఖపట్టణంజిల్లాల్లోని కొండప్రదేశాల లోని పంటలు ఒకమాదిరిగా బాగానే పండేయని చెప్పాలి. రాయగడ తాలూకాల్లో మహారాజావారి అమీన్ చింతపండుమీద పన్ను వేయడంచేత ఆందోళన రేగింది.

... ... ...

పార్వతీపురంలో కొండవాళ్ళ జయిలు నిర్మాణపుపనులు ఈయేడు చురుకుగా సాగేయి. పోతసింగిలో పోలీసులు గ్రామస్థులదగ్గర ధాన్యం వగైరా బలవంతంగా తక్కువ వెలకు కొని మారుబేరానికి అమ్ముకొనుచున్నారనే నేరం బుజువు అయింది.

... ... ...

సొండూరు సంస్థానాధిపతి రాజా శివషణ్ముఖరావు 1878 మే 3-వ తేదీని చనిపోయాడు. అతని పెద్ద అన్నగారు విఠల్‌రావు సాహేబ్ 1879 ఫిబ్రవరి 5-వ తేదీని సంస్థానాధిపత్యం వహించెను.

గంజాము, గోదావరి, కర్నూలు, బళ్లారి, కడప జిల్లాలలో రివ్యూసర్వే జరుగుచుండెను. కర్నూలులో సెటిల్‌మెంటు పనులు కూడా ముగిసెను. కడప, గంజాములందు సెటిల్‌మెంటు పనులు సాగుచుండెను.

... ... ...

ఇనామ్ కమీషన్‌వారి యాజమాన్యాన్ని కృష్ణాజిల్లాలో స్పెషల్ డిప్యూటీకలక్టరును నియమించిరి. గ్రామనౌఖరీ ఈనాములను ఎన్‌ఫ్రాంఛైజ్ చెయ్యడం అతని పని.

... ... ...

కృష్ణాజిల్లాలోని పెద్దజమీందారీ నూజవీడు 700 చతురపుమైళ్లవిస్తీర్ణం, 111000 జనాభా గలది కోర్టు ఆఫ్ వార్డ్సువారి యాజమాన్యం క్రిందకు వచ్చెను.

... ... ...

హిందూధర్మాదాయముల, ధర్మసంస్థల సక్రమపరిపాలనవిషయంలో తగు కట్టుదిట్టాలు చేయడానికి ఒకబిల్లు మద్రాసుప్రభుత్వంవారి ఆలోచనలో వుండెను.

... ... ...

1878 చివరలో అదనపు పోలీసుల్ని తొలగించిరి. అదనపు బత్తాలు తగ్గించివేశారు. ప్రజలతోబాటు పోలీసులున్నూ చాలా కష్టపడ్డారు.

... ... ...

1879 మార్చిలో గోదావరిజిల్లాలోని చిన్నజమీందారీ అయినరంపలో పితూరీరేగింది. గోదా-

వరిజిల్లాపోలీసులు, విశాఖపట్టణంజిల్లాపోలీసులు, దగ్గరజిల్లాల లోని రిజర్వుపోలీసులు, జెయిలు పోలీసులు కాక మద్రాసునుంచి సేన, డెప్యూటీ ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు వచ్చేరు. మద్రాసునుంచి ఓడమీద కాకినాడవచ్చి కాకినాడ నుంచి రాజమండ్రివచ్చేరు.

... ... ...

ఈసంవత్సరం ఆంధ్రదేశంలో రెండు చోట్ల తుపానుకొట్టింది. నవంబరుమాసారంభంలో విశాఖపట్టణం భీమునిపట్టణం ప్రాంతాల్లోనూ, డిశంబరుమాసారంభంలో కాకినాడప్రాంతాల్లోనూ తుపానువీచింది. విశాఖపట్టణం తుపానులో 'ఫైప్షైర్, కాంభగి, ఆలివ్ బ్రాంచి' అనే పేర్లుగల మూడు ఓడలు మునిగిపోయాయి. ఇరవై ఆరుగురు చనిపోయారు. కాకినాడ తుపానులో 'కోరమాండల్, క్వాట్రిసోర్సు' అనే రెండుఓడలు ఒడ్డు పట్టేయి. రెండవదానిలో ఏడుగురు చనిపోయారు. మిగిలిన అన్నిజిల్లాలు వానలేకపోవడంచేత బాధపడుతూవుంటే విశాఖపట్టణం, గోదావరిజిల్లాలలో అధికవర్షాలు, వరదలబాధ.

... ... ..

ధాతకరువుకి పూర్వం రూపాయకి పదహారుశేర్లు ఇచ్చేబియ్యం ఇప్పుడు తొమ్మిదిశేర్లే. కరువు తీవ్రంగావున్నప్పుడు ఎనిమిదిశేర్లే ఇచ్చేవారు. ఈసంవత్సరం ఆహారపదార్థాలు వెల హెచ్చుఅయినా బజార్లలో సమృద్ధిగామాత్రం దొరికేవి. బహుధాన్య బహుధాన్యే అనిపించింది.

... ... ...

కడప, కర్నూలు మండలాల్లోని రత్నపుగునుల్ని తవ్వడానికి కొంత ప్రయత్నంసాగింది.

... ... ...

మద్రాసు హార్బరులో పెద్ద మరామ్మతు.

... ... ...

బక్కింగ్‌హామ్ కాలువ పని నిమిత్తం 5,86,065 రూపాయిలు ఈసంవత్సరం వెచ్చించబడ్డాయి.

... ... ...

చెయ్యేరు (కడపజిల్లా), పెన్న (నెల్లూరు) పోతగట్లపని ప్రారంభింపబడింది. గోదావరి సెంట్రల్ డెల్టా ఏటిలాకు హెడ్‌స్లూసు పగిలిపోయింది. పదిహేను రోజుల్లో మరామ్మతు పూర్తిఅయింది.

... ... ..

బళ్లారినుంచి హాస్పేటకు, బెంగుళూరినుంచి మైసూరుకు రైలుబాట నిర్మాణం సాగుతూవుండెను.

.. ... ..

కరువు పనులనిమిత్తం లోగడ కడపలో స్థాపించబడ్డ ఇంపీరియల్ టెలిగ్రాఫ్ ఆఫీసు ఈసంవత్సరం మూసివేయబడ్డది.

... .. ...

నల్లమందు అమ్మకాన్ని గూర్చిన చట్టం ఈసంవత్సరమే ఈ రాష్ట్రంలో ప్రవేశపెట్టబడింది.

... .. ...

వర్తకులందరిమీద లైసెన్సు పన్ను విధింపబడ్డది. ఈరూపేణా ఈ సంవత్సరం 8 లక్షలరూపాయలు వసూలు చేయబడ్డాయి.

... ... ...

పోస్టాఫీసుల్లో మనియార్డరు డిపార్టుమెంటు రాష్ట్రం మొత్తం మీద మరి తొమ్మిదింట ప్రవేశపెట్టబడ్డది. మనియార్డరు సౌకర్యాలుగల పోస్టాఫీసుల సంఖ్య అందుతో 85 అయింది.

... ... ...

కర్నూలు, నెల్లూరు, బళ్లారి, కడప, గంజాము, విశాఖపట్టణం జిల్లాలలో పుట్టుకలు చాలా తగ్గిపోయేయి. కర్నూలు, కడప, బళ్లారి జిల్లాలలో చావులు మిక్కిలి అధికంగా వుండెను. గంజాము, విశాఖపట్టణం, కృష్ణా, గోదావరి జిల్లాలలో కలరా బహుళంగా వ్యాపించింది.

... ... ...

అనకాపల్లి మునిసిపల్ పట్టణంగా ప్రభుత్వంవారు ప్రకటించిరి.

... .. ...

రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో మొదటిసారి నలుగురు బియ్యేపరీక్ష ఇచ్చిరి.

. . ..

కృష్ణాజిల్లాలోని అమరావతి, ఉండవిల్లి దేవాలయాల్లోని శాసనాలు, చిత్రాలు పరిశీలించడానికి రాబర్టు సూయల్‌ను నియమించారు. అమరావతి విగ్రహాలు కొన్ని మదరాసులోని గవర్నమెంటు మ్యూజియమ్‌కు చేర్చబడ్డాయి.

. . .

కరువు తీవ్రంగా ఉన్నప్పుడు

డిస్ట్రిక్టు మునసబులకు, సబ్ జడ్జీలకు ఈయబడ్డ మెజిస్ట్రీరియల్ అధికారాలు ఈయేడు తగ్గించేరు.

... ... ...

నెల్లూరు జిల్లాలోని సూళూరుపేట, వెంకటగిరి తాలూకాకచ్చేరిలు కడపతాలూకాకచ్చేరీఈ సంవత్సరం పూర్తిచేయబడ్డాయి.

... ... ...

ఆనాటి తెనుగు మునిసిపాలిటీలు. వాటి జనాభా

| | |
|---|---|
| చికాకోల్ : | 15,587 |
| బరంపురము : | 21,670 |
| విశాఖపట్టణం : | 32,191 |
| భీమునిపట్టణం · | 8,744 |
| విజయనగరం : | 20,169 |
| అనకాపల్లి | 13,044 |
| కాకినాడ : | 17,839 |
| రాజమండ్రి : | 19,738 |
| ఏలూరు : | 25,487 |
| మచిలీపట్టణం · | 36,188 |
| గుంటూరు : | 18,033 |
| నెల్లూరు : | 29,922 |
| ఒంగోలు : | 7,392 |
| కర్నూలు · | 5,579 |
| కడప . | 16,275 |
| బళ్లారి : | 51,766 |
| ఆదోని : | 22,723 |
| గుత్తి : | 6,730 |
| అనంతపురం · | 4,918 |

... ... ...

ఆనాటి తెనుగు మునిసిపాలిటీలు, వాటి రాబడి :

| | రూ |
|---|---|
| చికాకోల్ · రూ | 5,510 |
| బరంపురము : | 13,700 |
| విశాఖపట్టణం : | 17,773 |
| భీమునిపట్టణం : | 5,088 |
| విజయనగరం : | 11,972 |
| అనకాపల్లి : | 5.241 |
| కాకినాడ | 18.638 |
| రాజమండ్రి : | 8,966 |
| ఏలూరు : | 15,114 |
| మచిలీపట్టణం : | 21,469 |
| గుంటూరు : | 17,965 |
| నెల్లూరు : | 16,050 |
| ఒంగోలు : | 7,762 |
| కర్నూలు : | 14,673 |
| కడప : | 17,337 |
| బళ్లారి | 44,805 |
| ఆదోని : | 11,787 |
| గుత్తి : | 2,692 |
| అనంతపురం ; | 4,139 |

... ... ...

ఈసంవత్సరాంతానికి రాజమండ్రి కాలేజీలో 49 గురు, మచిలీపట్టణం నోబుల్ కాలేజీలో 15 గురు, విజయనగరం మహారాజా కాలేజీలో 12 గురు విద్యార్థులు చదువుచుండిరి.

... ... ...

ఈసంవత్సరం రిజిష్ట్రార్ ఆఫ్ బుక్సువద్ద రిజిస్టరు అయిన పుస్తకాలసంఖ్య 824. అందులో 109 మాత్రమే తెలుగు గ్రంథాలు.

... ... ...

నాటి తెలుగుజిల్లాలు, వాటి ఆదాయాలు:

| | |
|---|---|
| గంజాము · | 38,48,482 |
| విశాఖపట్టణం : | 25,92.805 |
| గోదావరి | 61,70,730 |
| కృష్ణా : | 53,53,314 |
| నెల్లూరు : | 43,50,126 |
| కడప : | 26,26,733 |
| బళ్లారి · | 28,99,115 |
| కర్నూలు : | 20,13,54 |

... ... ...

నాటి తెనుగుప్రెస్సుల్లో మద్రాసులోని దేవరాజమొదలివీధిలోని పువ్వాడ వెంకటరావుగారి వర్తమానతరంగిణి ప్రెస్సు పేర్కొనతగింది. రావుగారు జ్ఞానభాను, వర్తమానతరంగిణి అనే రెండు వార్తాపత్రికలు ప్రకటించేవారు.

.. . ...

గంజాము జిల్లా బరంపురంలోని వార్తాలహరి , విశాఖపట్టణంలోని పేట్రియాటిక్ హిందు, వైజాగపటమ్ ఎగ్జామినర్, గోదావరి జిల్లా కాకినాడలోని సుమనోమనోభిరంజని, కాకినాడ ఎడ్వర్టయిజరు, రాజమండ్రిలోని వీరేశలింగంగారి వివేకవర్ధని , కృష్ణాజిల్లా బందరులోని స్వధర్మప్రకాశిని, పురుషార్థప్రదాయిని ఆనాటి మనపత్రికలు.

... ... ...

అప్పుడు రూపాయికి కరువుకి పూర్వం ఈ సంవత్సరం ఇన్నిన్ని సేర్లు అమ్మేవారు.

| | | |
|---|---|---|
| గంజాంలో బియ్యం: | 20 | 8 |
| విశాఖపట్టణంలోబియ్యం: | 17 | 8 |
| గోదావరిలో బియ్యం: | 20 | 7 |
| కృష్ణలో బియ్యం: | 16 | 7, |
| నెల్లూరులో బియ్యం. | 16 | 7 |
| కడపలో బియ్యం· | 14 | 7 |
| బళ్లారిలో బియ్యం· | 14 | 8 |
| కర్నూలులో బియ్యం. | 13 | 8 |

ఆ తల్లితండ్రులకు హృత్పిండాన్ని చిదిపే ఈ కష్టాలన్నీ కూడా అతనికి

# పిల్లనిచ్చినందుకు

చిన్న కథ

“చూడు, నాన్నా!, నే నెల్లాంటి చీర కట్టుకున్నానో! అక్కణ్ణుంచి తెచ్చుకున్న చీరలన్నీ చిరిగిపోయినాయ్. ఇదొక్కటే మిగిలింది. వెలిసిపోయి బూడిదరంగొచ్చినా ఇదే కట్టుకుంటున్నాను. ఉన్నదల్లా రవికా ఇదొక్కటే.”

రచయిత:

## పమ్మి రామశాస్త్రి

(పి)

పుట్టడమే మొగమహారాజై పుట్టేడతను! పెళ్ళయిన మరుక్షణం నుంచీ తన చెప్పుచేతల్లో వుండవలసిన మనిషి అవనే అయిందామె. వివాహంతో సంక్రమించిన ఆ అధికారాన్నతడు దుర్వినియోగ పరిస్తేమాత్రం అడగడానికెవరు సాహసిస్తారు? గట్టిగా అడిగితే, నే నామెని యేలుకోనంటే? అతడల్లా అన్నతర్వాత ఇంక చేయవలసిందేముంది? వియోగ దుఃఖాన్ననుభవిస్తూ ఆమె జీవితశేషం గడపవలసిందేగా! తప్పు తనది కాకపోయినా శిక్ష అనుభవించి తీరవలసిందేగా! — ఇదీ భయం.

అందుచేతే పిల్లని తనింటికి పంపకపోయినా కొంతకాలం ఓపిక పట్టి ఊరుకున్నాడు విశ్వం. ఒక నెలా, రెండు నెల్లూనా? — సంవత్సరం గడిచిందిల్లా. ఇహ పిల్లని చూడకుండా తానూ వుండలేకపోయాడు. తన భార్యా బెంగతో మంచం పట్టింది. కడుపుతీపి! పాపం! — సాహసించి అల్లుడుదగ్గిరకెళ్ళి పిల్లనోసారి తనింటికి పంపమని ప్రాధేయపడ్డాడు. మూడునిద్రల కంటూ పంపిన పిల్లని మళ్ళీ పుట్టింటిమొహం చూడనివ్వకపోడం చాలా కవారం నాయనా అని అనేకవిధాల బోధించాడు. ఒక్కగాని ఒక్క పిల్లని కలిగుండీ, మొగపిల్లాడేనా అదే, ఆడపిల్లైనా అదే అనీ దానిమీదే ప్రాణాలు నిలుపుకొని వున్న మమ్మల్నిల్లా బాధించడం న్యాయంకాదనీ సవినయంగా చెప్పుకున్నాడు.

మీ ఆస్తిని చూచి పిల్లని నేనిచ్చానా? — చెప్పు, మీ నాన్న రాసిన వుత్తరాలిప్పటికీ నాదగ్గరున్నాయ్. ఆస్తే ప్రధానంగా పెట్టుకోక, మన కున్న స్నేహాన్ని పాటించి బంధుత్వం కలపమని మెన్నోవిధాల కోరేడు.

ఉన్న విషయం చెబుతున్నా, కోప్పడకుసుమా — ఏమైనా భ్రముంటే మీ నాన్నతో నిమిత్తం లేకుండా, రెండువందల రూపాయ లిమ్మన్నా తా నిస్తాననీ, తప్పకుండా పిల్లని మా అబ్బాయికే ఇవ్వడానికి నిశ్చయించమనీ, మీ అమ్మకూడా అనేక కభుర్లు పంపింది నాకు. నేను పిల్ల నమ్ముకుంటానా? ఆస్తి లేకపోయినా ఆయుర్భాగ్య ముంటే మీ కాలక్షేపం మీరు చెయ్యలేకపోతారా అనుకొనే గదా పిల్ల నిచ్చాను?

ఓడ దాటేదాకా ఓడ మల్లన్నా — ఓడ దాటింతర్వాత బోడి మల్లన్న అన్నట్టు సూత్రధారణ అయిందిలగాయితు మీ అమ్మగారు పోయిన పోకిళ్లు ఈశ్వరునకెరుక, నేనే దరిద్రుణ్ణయితే ఆమెకు లాంఛనాలెల్లా తీర్చగలను, చెప్పు! ముందే నేను చెప్పేనే! ఎందుకు మమ్మల్నిల్లా బాధించడం? ఆవిడ మాటలు పట్టుకుని పేచీలు పెంచుకొని మనస్సులు పాడుచేసుకోవడం మంచిదికాదు. నే నేమైనా డబ్బిమ్మన్నానా దస్కం ఇమ్మన్నానా?

ఎప్పుడు తీసుకువెళ్ళ మంటే అప్పుడు పిల్లనోసారి మావూరు తీసికెళ్ళి మళ్ళీ ఎప్పుడు తీసుకురమ్మంటే అప్పుడు తీసుకొచ్చి దిగబెట్టి వెడతాను.' అన్నాడు.

'ఇహ చాల్లెండి వుపన్యాసం; ఇప్పుడు పంపడానికి వీల్లేదు.' అన్నాడు శంకరం—విని విని. విశ్వం కళ్లు చెమ్మగిల్లేయ్. రుద్ధకంఠంతో 'కట్టుదానితల్లి బెంగతో మంచం పట్టింది. ఒక్కసారి పంపి దాని జీవాలు నిల్పవూ?' అని అడిగేడు విశ్వం.

శంకరం సమాధాన మివ్వకుండా వెళ్ళిపోయాడు.

పాపం విశ్వం మనోవేదనానిలం వెయ్యినాల్కలతో ప్రజ్వరిల్లినా, ఆకర్కశహృదయాన్ని కరిగించలేకపోయింది సరిగదా, ఒక్కసారి చురుక్కుమనైనా అనిపించలేకపోయింది. స్పర్శజ్ఞానం లేని కుష్ఠురోగిశరీరానికి నిప్పువేడి తగిలితే మాత్రం ఏం తెలుస్తుందీ?

## (౮)

శల్యావశిష్టయి మంచాన్నంటిపెట్టుకుని పడుకున్న ఆజీవిని కనిపెట్టుకొని, ప్రక్కగా ఓపడక్కుర్చీలో దుఃఖంతో కుమిలిపోతూ కూర్చున్నాడు విశ్వం. నిరోధించిన కొద్దీ ఏవో ఆలోచనలు స్ఫురిస్తూ అతని మనోఫలకంమీద అనేక దృశ్యాల్ని కనబరచి బాధించాయ్. ఇల్లాకొంతసేపయింతర్వాత కునుకు పట్టింది. అత్తవారింటిదగ్గరున్న చిట్టి ప్రత్యక్ష మయింది.

కౌగలించుకు యేడుస్తూ 'నన్నీ వేళ తీసుకెళ్లాలి' అంది.

'అందుకే కదమ్మా వొచ్చింది' అన్నాడు విశ్వం—పొరలివచ్చే దుఃఖాన్ని దిగమింగుకొంటూ.

'నన్ను తప్పకుండా తీసుకెళ్లాలి సుమా.' అంది.

వెఱ్ఱిచూపులు చూస్తూ, 'ఆఁ .. కూచో అమ్మా .. కూచో' అని చిట్టీని క్రింద కూచోపెట్టి, తనమొహం ప్రక్కకు తిప్పుకు కూచున్నాడు—పైకి విచారించినట్టు కనబడితేనే ఆమె బెంగటిల్లిపోతుందని.

'ఆఁ అంటావంతే, గట్టిగా పంపమని అడగవ్!'

'అడక్కేంతల్లీ...అడుగుతా; నీకు భయంలేదు.'

'చూడు నాన్నా, నే నెల్లాంటి చీర కట్టుకున్నానో! అక్కణ్ణుంచి తెచ్చుకున్న చీరలన్నీ చిరిగిపోయినాయ్. ఇదొక్కటే మిగిలింది. వెలిసిపోయి బూడిదరంగొచ్చినా ఇదే కట్టుకుంటున్నాను. ఉన్నదల్లా రవికా ఇదొక్కటే; రోజూ స్నానంచేసింతర్వాత ఇవి వొంటిని ఆరిపోవలసిందే.' అంది చిట్టీ ఏడుస్తూ.

డగ్గుత్తికతో 'ఊరుకో...ఊరుకో' అన్నాడు విశ్వం.

'కాస్త చిరుగట్టిందంటే, నా చీర అమ్మకిచ్చేసి దాని కొత్తచీర నేను తీసుకోనేదాన్ని. ఇప్పు డిల్లా ...' అంటూ ఒకటే యేడుపు.

'ఔనాను. ఊరుకో. ఊరుకో.'

'ఇంట్లో ఏ పిండివంట వొండుకున్నా తను తినకుండా దాచుంచి నాకు పెట్టేది అమ్మ, ఇప్పుడు కడుపునిండా తిండికూడా కరువైపోయింది. కుక్కకు పారేసినట్టు ఒక కంచంలో కాస్త అన్నం పడేసి వుంచడం—మళ్ళీ అడగడానికా నాకు నోరురాదు. అన్నం సరిపోయిందా అని అడిగే వా రెవరు?' ఆమె కండ్లవెంట అంతులేని అశ్రుధారలు.

విశ్వం హృదయాని కామాటలు అంపపుకోత లౌతున్నాయ్. విచారించినట్టు ఆమెకు తెలియకుండా ప్రక్కకు తిరిగి కొంగుతో కళ్లు అద్దుకుంటున్నాడు. చెప్పేదల్లా వింటూవుండడమే గాని సమాధానం కూడా ఏమీ చెప్ప లేకుండా వున్నాడతను.

'నిన్నటిమట్టుకు నిన్న రాత్రి తెల్లవార్లూ నుంచునే వున్నావు గదా!'

ఇహ బిగబట్టలేకపోయాడు దుఃఖాన్ని. బ్యారుమని చిట్టీని దగ్గిరికి తీసుకొని 'ఏమ్మా... ఏం... పొద్దుపోయిందాకా మేలుకుంటేనే జబ్బుచేస్తుందని ఎనిమిదిగంటలు దాటిన తర్వాత చదువుకో నిచ్చేవాణ్ణి కాదు. నేటికాలానికి నీకీగతొచ్చిందా!' అన్నాడు. చిట్టీకి దుఃఖ మెక్కువయింది.

విశ్వం ధైర్యం తెచ్చిపెట్టుకొని 'ఇహ వూరుకో. అల్లా ఏడవకూడదు.' అన్నాడు.

'సుస్తీగా వుందని మొన్నరాత్రి [smudged]త్తగారు కాళ్లు పిసగమంది. [smudged]డుగంటలదాకా అల్లా పిసుగుతూనే వుండగా ఆవిడికి కునుకుపట్టింది. నిద్ర పట్టిందిగదా అని నేను వెళ్ళి పడుకున్నాను. మరికొంతసేపటికి మెళుకువ వచ్చింది గాబోలు. తెల్లారింతర్వాత హైకురుమజ్జా అంటూ లేచింది నామీదికి. అంతసేపూ కూచుంటేనూ—[smudged]యక్కు చెల్లించుకొన్నాననీ, ఉన్నట్టే కాశే వుండి తుర్రుమన్నానని ఒకటే తిట్లు. కూచోపెట్టి మేపుతున్నారట నన్ను, ముప్పొద్దులా మూడుకంచాలుచెల్లిస్తున్నానుట.'

'ఊరుకో... ఊరుకో... నీ తిండి వాళ్ళకు బరువైపోయింది.' అన్నాడు విశ్వం ఏడుస్తూ.

'అంతటితో వూరుకోక కొడుకుతో చెప్పి కొట్టించింది. పేం[illegible]త్తంతో కొట్టేరు, వాతలల్లే ఎల్లా వున్నాయో చూడు.' అని దండ చూపించింది.

చూసి, 'ఊరుకో...ఊరుకో.. దుర్మార్గుడు. చిలకని తీసి కెళ్ళి కసాయిచేతులో పెట్టేం మరి.' అన్నాడు విశ్వం— కన్నీరు బొటబొట రాలుస్తూ.

'నే నిక్కడ వుండలే నింక. నన్నిప్పుడు మనవూరు తీసుకెడతావా తీసు కెళ్ళవా?'

'నీకు భయంలేదులే... తీసుకెడతాగా.'

(ని)

'చిట్టీ! వచ్చావా?... నాతల్లీ ఇల్లారా... ఇల్లారా' అంది సోదెమ్మ— సన్నని గొంతుగతో.

కలవరించిందో యేమిటో।

విశ్వానికి మెళుకువ వచ్చింది.

'ఏఁవిటీ అంటావ్?' అన్నాడు.

మాట్లాడలేదు సోదెమ్మ.

మరికొంతసేపటికి ఏడవడం మొదలెట్టింది. విశ్వం దగ్గిరిగా వెళ్ళి 'ఎందుకూ ఏడుస్తావ్' అన్నాడు.

అప్పుడామెకు మెళుకువ వచ్చి ఇటూ అటూ చూసి 'ఏదీ చిట్టీ?' అంది. విశ్వం ఊరుకున్నాడు.

దుప్పటీ కప్పుకు పడుకుంది సోదెమ్మ.

పంపనన్నాడని చెబితే ఆక్షణంలోనే ప్రాణం విడిచిపెడుతుందేమోనని 'వస్తుంది, అతను తీసుకొస్తాడీవేళ.' అని అబద్ధమాడిన విశ్వం సమాధానమే మిస్తాడప్పుడు! తెల్లబోయి కూచున్నాడు.

(చ్చి)

మర్నాటి రాత్రి.

వైద్యుడు వచ్చి చూశాడు.

'నేను వాడవలసిన మందులన్నీ వాడేను. మందులు వాడినకొద్దీ ఈవిడకీఅతిసారం హెచ్చుతోంది గాని తగ్గే సూచన న్లైపీ కనిపించకుండా వున్నాయేవిటండీ! పైగా దుర్లక్షణాలు కూడా కొన్ని కనబడుతున్నాయ్—ఈవేళ. ఇవిగో.. ఈమోతాదులు రొండూ వాడి చూడండి. మీఅదృష్ట మేమేనా వుంటే దీనితో తేలాలి.' అని రొండు పొట్లా లిచ్చి వెళ్ళిపోయాడు.

వైద్యుడు చెప్పిన మాటలు విశ్వాన్ని పిచ్చెత్తించాయ్.

ఓమోతాదు సోదెమ్మనోట్లో వేసి ఆమంచంమీదే కూచున్నాడు —ఏదో ఆలోచిస్తూ, సోదెమ్మ రోగందారి రోగానిదీ మందుదారి మందుదీనీ! మనోవ్యాధులు మందులతో ఉపశమిస్తాయా మరి?

విరోచనాలికి అంతూ పంతూ కనిపించకుండావుంది. నిస్సత్తువ హెచ్చిపోతోంది. మాట్లాడడానిక్కూడా ఓపికలేని స్థితి కొచ్చిం దాఖరికి. 'చి.. చి.. చి..' అని అని పెద్దనిద్దర్లో ప్రవేశించబోతోంది.

విశ్వం గొల్లుమంటూ ఇల్లంతా కలయదిరిగి 'పెట్టుకో... నీపొట్టని పెట్టుకో... నీపొట్టని పెట్టుకో' అంటూ తల గోడ నేసుకొట్టుకొని ఏడుస్తూ దొడ్లో నూతిదగ్గరకు పరుగెత్తుకు పోయాడు.

భళ్లున శబ్దం.

నూతికి సమీపంలోవున్న మఱ్ఱి చెట్టుమీది కాకులు ఒక్కసారిగా ఎగిరి 'కావ్... కావ్' మని అరిచాయి.

(నం)

చుట్టుపట్లవాళ్ళందరూ— మెళుకువ వచ్చి—'ఏఁవిటో ఈధ్వని' అనుకొంటూ పరుగెత్తుకు వచ్చారక్కడికి.

'విశ్వం, విశ్వం' అని కేకలు. సమాధానం లేదు. లోపలి కెళ్ళడానికి వీల్లేకుండా వీధితలుపు గడియ వేయబడుంది. వచ్చినవాళ్లు సంగతేమిటో తేల్చుకోకుండా

ఎల్లా వెడతారు? కొందరు గోడ దూకి దొడ్లోకి వెళ్ళేరు. కూడా తెచ్చిన లైట్ల సహాయంతో నూతి లోకి చూశారు. 'విశ్వం .. విశ్వం నూతిలో పడిపోయాడు.రండి రండి' అని కేకలేశారు. పరుగెత్తుకెళ్ళి నిచ్చెన్లూ, తాళ్లూ పట్టుగొచ్చి విశ్వాన్ని నూతిలోంచి పైకి తీశారు. మునసబు రత్తయ్యను వెంటనే రమ్మని కబురు చేశారు. వైద్యుని కోసం ఇద్దరు మనుష్యులు పరుగెత్తేరు.

రత్తయ్య కీవిషయం తెలియడం తోటే ఊళ్ళోనే వున్న పోలీస్ ఇన్ స్పెక్టరుగారికోసం ఓమనిషిని పరుగెత్తించి తా నక్కడకు వెళ్లేడు.

ఇన్ స్పెక్టరుగారు రావడంతోటే ఓ బుద్ధిమంతుడు దగ్గిరిగావచ్చి నమస్కరించి 'బాబూ! ఈవిశ్వం గారి కొక్కత్తే కూతురు. పిల్ల నిక్కడికి పంపక అల్లుడు నానాయేడ్పూలూ ఏడ్పించాడు. ఆ బెంగతోనే ఈయన పెళ్లాం మంచం పట్టి ఈవేళో రేపో అన్నట్టుంది. ఈ విచారంచాతే ఈయన నూతిలో పడివుంటాడు. వెంటనే ఆపిల్ల నిక్కడికి తీసుకొచ్చే యత్నమేమైనా తమరు చేశారా అంటే కొనూపిరేమైనా ఈయనకుంటే పిల్ల కళ్ళబడేటప్పటికి ప్రాణాలు కోలుకుంటాయేమో నని నాకు భ్రాంతుంది. ముందుగా మీ రాయత్నం చెయ్యా'లని ప్రార్థించాడు.

అతడు చెప్పినమాట నిజమే అనుకొని ఆమెను తీసుకురావడానికి, వెంటనే నలుగురు రక్షకభటుల్నీ, అక్కడున్నవారిలో ఇద్దరు పెద్దమనుష్యుల్నీ తనకారులో పంపించారు ఇన్ స్పెక్టరుగారు.

(౯)

'శంకరంగారూ!'

'ఎవరు వారు?'

'నేను నారాయణమూర్తిని.'

'నారాయణమూర్తంటే!' అంటూ తలుపుతీసుకు బైటకొచ్చాడు శంకరం.

'ఓహో! మీరా! ఇల్లా వొచ్చారేం?'

'చిట్టీని తీసు కెళ్ళడానికి.'

ఈమాటలు వినేటప్పటికి శంకరం దృష్టి లారక్షకభటులమీదకు వాలేయ్. ఏదో వుందనుకొన్నాడు.

'మీ రనేదేవిటో నాకు బోధపట్టం లేదు.'

'బోధపడ్డాని కేముందీ! విశ్వం తనపిల్ల నోసారి తనింటికి పంపమని అనేకసార్లు కోరినా నిరాకరించారుటగా మీరు?

'ఆఁ అవును, అయితే.'

'ఆయ నిప్పుడు చాలా అపాయ స్థితిలో వున్నాడు. ఈరక్షకభటుల సహాయంతో పిల్లని తీసుకు రమ్మని పోలీస్ ఇన్ స్పెక్టరుగారు పంపించారు.'

శంకరం గుండెలు దడదడా కొట్టుకొంటున్నాయ్. మొహం వెలవెలబోయింది. 'ఇంత హంగామా చెయ్యాలా? ఆయనేవస్తేం?' అని సణుక్కొని 'సరే తీసు కెళ్ళండి. నిక్షేపంలాంటి కాపురం నీట కలుపుకోవాల్నుంది కాబోలు వాళ్ళకి! నా కేంవీ విచారం లేదు.'

'ఔనౌను. అన్నీ యెరుగుదుం గాని పంపాలి చప్పున, పొద్దుపోతోంది. చిట్టీ! చప్పున వచ్చి కారులో కూచో' అన్నాడు నారాయణమూర్తి.

'శీఘ్రంగా వెళ్ళిపో' అన్నాడు శంకరం.

'శీఘ్రంగా వెళ్ళాలనేగా! నీవంటి మూర్ఖుడికి పెళ్లాం కూడా ఎందుకు? హృదయమనే దుందా నీకు? నీతల్లి దండ్రుల్నీ, అక్కచెల్లెళ్ళనీ చూడకుండా చేస్తే నీ కెంత కష్టంగా వుంటుందీ! ఆడదానికి మాత్రం తనవాళ్ళని చూడాలని వుండదేం? పెళ్ళిలో నీతల్లికి జరగవలసిన మర్యాదలు జరగలేదనే నెపంతో పేచీలు పెంచుకుని ఈపిల్ల నిల్లా క్షోభ పెడతావా? మళ్ళీ చదువుకున్నావ్, ఎందుకూ?' అన్నాడు నారాయణమూర్తి.

చిట్టీ వీధిలో కొచ్చి నుంచుంది. శంకరం తెల్లమతాబా వెలిగించి వూరుకున్నాడు.

(౧౦)

కారులో కూచున్నతర్వాత.

'నారాయణమూర్తి అన్నయ్యా! చూశావుగా పరిస్థితులు? ఎన్ని బాధలనుకున్నావ్!

'ఔ నమ్మా, ఔను. అన్నీ ఎరుగుదును.'

'ఏవిటీ? ఇందాకా—అపాయ స్థితిలో వున్నా డన్నా వేవిటి— మానాన్న?'

'ఆ. ఏముం దీ రాత్రి— చీకట్లో వెళ్లేదుగాబోలు దొడ్లో కి,... ...'

'ఆఁ వెడితే?' అంది చిట్టీ— అదుర్దాగా.

'అంత ఖంగారు పడకు—మీా నూతికి చుట్టూ రాయి కట్టలేదు గా ఇంకానూ.'

'దానిలో పడ్డాడా ?' అంది గట్టిగా.

'మరే- వేంటనే పయికి తీశా రులే.'

'తీశారుగదా? సుఖంగా వున్నా డుగదా?' అని ప్రశ్నించింది చిట్టీ.

'ఆఁ... ఆఁ' అని చాచేశాడు నారాయణమూర్తి.

ఔను మరి; అతనికిమాత్ర మేం తెలుస్తోంది? నూతిలోంచి విశ్వా న్ని పైకి తీయడానికి యత్నాలు జరుగుతుండగానే ఇక్కడి కొచ్చే డాయె!

'మా అమ్మ కులాసాగా వుం దా?'

'కులాసాగా ఎల్లా వుంటుంది చెప్పు? నీమీాద బెంగతో మంచం పట్టింది.'

'మా అమ్మేనా!! అయ్యో! మానాన్న నాతో చెప్పనే లేదే ఈసంగతి!'

'నువ్వు బెంగెట్టుకుంటా వని చెప్పలేదేమో.'

'ఈమధ్య నన్ను తీసుకెళ్ళడాని కొచ్చాడా! వెళ్లేటప్పుడు నాతో చెప్పకుండానే వెళ్ళిపోయాడు.'

'అతను పంప నన్నాడు గా! ఈసంగతి నీతో చెప్పి ఇంకా ఏడి పించడ మెందు కనుకున్నాడు గా బోలు!'

*   *   *

మరోకఅరగంటకి కారు వచ్చి విశ్వంగారి యింటిముందు ఆగింది.

చిట్టీ కారు దిగి చరచరా లోపలి కెళ్ళి గొల్లుమంది. విశ్వాన్నో మంచంమీాదా, సోదెమ్మ నోమం చంమీాదా పడుకో బెట్టేరు.

'ఇంకా ఏడుస్తా వెందుకు? వారిగండాలు గడిచేయ్. ఇక నే మీా భయంలేదు. ఊరుకో.' అ న్నాడు వైద్యుడు.

ఏడుస్తూ, తల్లిదండ్రుల మధ్యా లికి మధ్యగా కూచుంది చిట్టి.

విశ్వం ఆమెను చూస్తూ అశ్రు ధారల్తో మంచ మంతా తడిపేశు.

వైద్యుడు సోదెమ్మకు అంతకు పూర్వ మిచ్చిన ఇంజక్షన్ బాగా పనిచేసింది. చిట్టిని చూడ్డంతోటే 'చిట్టి చిట్టీ చిట్టి' అంటూ లేవ బోయింది.

'లేవకు. పడుకో. పడుకో' అ న్నాడు వైద్యుడు.

ఏయింట్లో కుణంక్రితం మృత్యుదేవత తాండవం చేసిందో ఆ యింట్లోనే ఆనందవాహినులు వెల్లి విరుస్తున్నాయి యిప్పుడు.

జిజ్ఞాస

> విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొనప్రతికొముఖమున జిజ్ఞాస సలుపుటకును—ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైనను సరే పరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము. —సంపాదకుడు.

మీమాంస

## ౧౧౪. హాలివుడ్డు: హైందవనటకులు

జయరాజ్ (హైద్రాబాద్ నివాసి) పృథ్వీరాజ్ (ఉత్తరహిందుస్తాన్ నివాసి) లిద్దరూ హాలీవుడ్ ఫిలిమ్‌లో నటించ వెళ్లినట్లు వినియున్నాను. నిజమేనా? ఐతే ఎన్నిదినములైనది? ఏ ఫిలిమ్‌లో నటించడానికి?

## ౧౧౫. నటకుడు టీకా

టీకా సుబ్రహ్మణ్యం హిందుస్తాన్ ఫిలిమ్‌లో నటించుచున్నాడా? ఐతే అతను ఆంధ్రుడేనా? అతని గ్రామమేది?

## ౧౧౬. బ్రహ్మకు ఆలయం

బ్రహ్మపూజకు ఎక్కడా ఆలయం లేనట్లు మార్చిమాసపు 'ఆంధ్రభూమి' మీమాంసలోవుంది. ఉత్తరహిందూస్తానంలో అజమీర్‌నకు సమీపంలో పెష్కర్‌రాజ్ లేక బ్రహ్మపుష్కర్‌నీ గ్రామంలో బ్రహ్మ ఆలయం వుంది. ఆమీమాంసకారులు దీనికి ఏమి చెపుతారు?

## ౧౧౭. సత్యనారాయణవ్రతం

సత్యనారాయణవ్రతాన్ని, మా నిజాం రాష్ట్రములో బ్రాహ్మణులు ఇతరుల ఇళ్ళలో చేయిస్తారు కాని, వారి ఇళ్ళల్లో చేసినట్లు చూడలేదు. బ్రిటీష్ ఆంధ్రదేశములోను ఇంతేనా?

—సింగం సత్యనారాయణ గుప్త.

## ౧౦౯. ఆంధ్రదేశంలో ఆటవస్తువుల పరిశ్రమ

చెంగల్పట్టుజిల్లాలోని కంచిలో తెలుగుకుమ్మరులు మట్టిలో పక్షు, పిట్టలు, జంతువులు మొదలైనవి చేసి రంగువేసిన్నీ-అక్కడే తెలుగు క్షత్రియులు కర్రలో వాహనాలు, బొమ్మలు చేసి రంగువేసిన్నీ అమ్ముతారు. కడపజిల్లాలోని రాజంపేట తాలూకా సెట్టిగుంటలో ఎర్రచందనం చెక్కలో బొమ్మలుచేసి తిరుపతిలో అమ్ముతారు. కృష్ణాజిల్లా బెజవాడతాలూకాలోని కొండపల్లిలో తెల్లపొనుకకర్రలతో మగవాళ్లున్ను, ఆవుపేడతో ఆడవాళ్లున్ను బొమ్మలుచేస్తారు. నెల్లూరులో జినిగార్లు ఆటవస్తువులు కర్రతో ఉత్సవాల, జాత్రల, తీర్థాల సందర్భంలో చేస్తారు. విశాఖపట్టణంజిల్లాలో ఏటికొప్పాక, శృంగవరపుకోట, నక్కపల్లి, చందనాడు, లక్కవరపుకోట అనే తావులందు లక్కసామానులు, ఆటవస్తువులు చేస్తారు. నక్కపల్లి బొమ్మలప్రసిద్ధి పురాతనమైంది. —'పారిశ్రామికాంధ్రదేశము'నుండి.

## ౧౧౦. తిరుపతి ఆదివరాహక్షేత్రము

తిరుపతికొండపై శ్రీస్వామివారికోవెలప్రక్కను యాత్రికులు స్నానాదులు వగయిరాలు చేయుటకు ఒక కొలనుగలదు. ఆకొలను అవతలవడ్డున ఒక దేవళముకలదు. ఆదేవళము వరాహస్వామి దేవళమనియు, శ్రీ వేంకటేశ్వరస్వామివారు అచ్చటకు విచ్చేసి సదరు కొండను వరాహస్వామివద్ద కౌలుకు పుచ్చుకొనిరనియు శ్రీవారు శ్రీవరాహస్వామికి వ్రాయించి యిచ్చిన కౌలునామా కలదనియు చెప్పుచు ఇదియే ఆకౌలు అని అచ్చటి అర్చకులు ఒక రాగిశాసనమును చూపుచున్నారు. అల్లాయుద్దీన్ సేనానాయకుడగు మాలికాఫర్ దక్షిణదిగ్విజయములు జరుపుచున్నప్పుడు తిరుమలపైకెక్కి లూటీ చేయవెంచి ఆ క్షేత్రపు భోగట్టా ఒక హిందూసిఫాయిని అడగగా అతడు తిరుపతిగ్రామంలో భోగట్టాచేసి తిరుమల క్షేత్రము పేరు ఆదివరహక్షేత్రమని తెలుసుకొని తన స్వామితో కొండపైనున్న దేవుడు పందిదేవుడని చెప్పగా అతడు "ఛీఛీ"యని వెడలిపోయినట్టు ఒక ముక్కంటి గాథను తిరుపతివాసులు చెప్పుదురు. ఒకటిమాత్రము నిజము. సంకల్పములు ఆ క్షేత్రమందు చేయునప్పుడు "ఆదివరాహక్షేత్రే—"అనుచు మొదలిడుదురు.

—తె[illegible]డు.

## ౧౧౧. కాళహస్తి గాలిగోపురం

కాళహస్తిలో గాలిగోపురం దేవాలయానికి సంబంధించక దూరముగా వుండడానికి నాకు తెలిసిన కారణం యిది: మొదట్లో ఆగాలిగోపురం దేవాలయానికి సంబంధించే వుంటేది. సామాన్యంగా ప్రతిదేవాలయానికి గాలిగోపురం కొన్నిగజాల దూరంలోవుండడం ఆచారం. కాని ఈదేవాలయం ఎంత పెద్దదో, ఎంతటి తీర్థ

### [illegible]. యూరప్‌లోని దేశాలు

యూరప్ ఖండంలోని వివిధ దేశాలు ఎన్ని? అందులో రాజాధిపత్యంలో వున్న దేశాలు ఏవేవి? రిపబ్లిక్‌లై వున్న దేశాలు ఏవేవి?

—శ్రీపాద గురునాథం.

### ౧౧౯. రష్యాభోగట్టా

రష్యాను యు. యస్. యస్. ఆర్ అంటున్నారు. యు. యస్. యస్. ఆర్ అంటే ఏమిటి? రష్యాను మినహాయించిన యూరప్‌కంటె యు. యస్. యస్. ఆర్ వైశాల్యంలో పెద్దదా? దాని జనాభా ఎంత? వైశాల్యాన్నిబట్టి, జనాభాను బట్టి ప్రపంచంలో దాని స్థానం ఎట్టిది?

—పత్తుల సాగరం.

### ౧౨౦. ఆంధ్రదేశంలో ఆంగ్లేయుల ఆదిపీఠం

ఆంధ్రదేశంలో ఆంగ్లేయులు మొదటిసారి కాలుపెట్టిన ప్రదేశం యేది? దానిని ఇప్పుడు ఏపేరుతో పిలుస్తున్నారు? అక్కడ ఆంగ్లేయులు ఫ్యాక్టరీ యేమైనా స్థాపించినారా? అయితే అది ఎంతకాలం సాగింది? అచ్చటి ఫ్యాక్టరీకోసం ఆంగ్లేయులు దేశీయులికి ఎవ్వరికికాని శిస్తు ఏమన్నా కట్టేవారా?

—రాయుడు వెంకటేశ్వర్లు.

### [illegible]. సంస్కృతకవిత్వము : ఆంధ్రస్త్రీలు

సంస్కృతములో కవిత్వము చెప్పిన ఆంధ్రస్త్రీలు ఎవరైనా ఉన్నారా? ఉంటే వారినామములు ఏమి? వారు ఏయే కాలములవారు? వారు రచియించిన గ్రంథాలు ఏమేమి?

—తిరుపీధుల తాయారమ్మ.

స్థలమో, ఎన్నివేలమంది యాత్రికులు ప్రతిసంవత్సరము వుత్సవదినాలలో [illegible] గూడుతూ వుంటేవారో గాలిగోపురం యింతదూరంగా వుండడాన్నిబట్టి మొత్తం దేవాలయ విస్తీర్ణతను మనం పోల్చవచ్చు. వుత్సవదినాలలో తప్ప మిగతా రోజులలో ఆ దేవాలయానికి ప్రాముఖ్యత లేకపోవుటచే గాబోలు దేవాలయము మొదలు ఈ గాలిగోపురం వరకుగల ప్రదేశము అనుపయోగము గా నుండుటను, ఆస్థలమును ఉపయోగపరచి తద్వారా ధనార్జనకు సిద్ధపడి, అప్పటి ప్రభుత్వము (షుమారు 1880-90 సంవత్సరములలో) ఆదేవాలయార్చకుల మంచిచేసుకొని ఆస్థలమునంతను రోడ్డుక్రింద మార్చివైచిరేమో అనియు, అప్పటినుండి సంబంధము లేనట్లుగా రూపించు ఆ గాలిగోపురం, పేరు ప్రతిష్టలు లేక గబ్బిలములకు నిలయమైనదేమో అనియు తోస్తుంది.

—కాంచనపల్లి వేంకటరంగారావు.

చాలాయేండ్ల నాటిమాట. దక్షిణకాశి అనబడే కాళహస్తిలో ఈశ్వరాలయానికి గాలిగోపురం లేకుండా వుండేరోజుల్లో ఒక వారాంగన —అశేషధనవంతురాలు— స్వామివారి ఆలయంముందు గాలిగోపురం ఒకటి కట్టించడానికి పూనుకుంది. ధనవతి కావటంచేత పేరుపడ్డ శిల్పులను పిలిపించి వారిచేత మహా అందంగా గాలిగోపురం కట్టించింది. ఆగాలిగోపురం- అందంలో గానీ, శిల్పనైపుణ్యంలో గానీ, పొంకంలో గానీ చాలా ఉత్తమతరగతికి చేరుతూంది. కానీ అది యీనాడు పాడుపడి గబ్బిలాలకు నివాసస్థలమైవుంది. అది దేవాలయానికేమీ సంబంధించినట్లుకూడా వుండదు. ఒకప్రక్కగా వుంటుంది. కాళహస్తీశ్వరుడుకూడా ఆ గాలిగోపురంలో ప్రవేశించడు దానికి కారణం చెబుతాను. గాలిగోపురం పని పూర్తిఅయిన తర్వాత ఆ పణ్యస్త్రీ తానుచేసిన ఘనకార్యానికి పొంగిపోయి, తాను కాబట్టి యింతటి కార్యం చేయగలిగినందుకు గర్వించిందట. అంతేకాకుండా ఆగాలిగోపురానికైన ఖర్చంతా- రూపాయలు- అణాలు- పైసలతో సహా లెక్క చూచుకున్నదట. ఒకనాటిరాత్రి స్వామి కలలో కనిపించి 'నీవు గాలిగోపురానికి పెట్టిన ఖర్చంతా దమ్మిడీలతో సహా లెక్కపెట్టుకొని గర్వించావు, కాబట్టి నేను నీ గాలిగోపురంలో అడుగుపెట్టనుచూడు' అన్నాట్ట. ఆవిడ హడలిపోయింది. 'స్వామీ! నాతప్పు క్షమించి నన్ను అనుగ్రహించండి' అని ప్రార్థించిందట. స్వామివారికి అనుగ్రహంకలిగింది. 'సరే, సంవత్సరానికి ఒక్కరోజు నీ గాలిగోపురంలోకి వస్తాలే' అన్నాట్ట. అల్లాగే సంవత్సరానికి ఒక్కరోజు కాళహస్తీశ్వరుడు ఉత్సవంతోవచ్చి ఆ గోపురంలో ప్రవేశిస్తాడు. ఆవిడకు ఈశ్వరసాయుజ్యం దొరికివుంటుంది. కాని, ఆమెకీర్తికి కళంకంమాత్రం చిరస్థాయిగా నిలిచిపోయింది. సంవత్సరంలో ఒక్కదినంతప్ప మిగతారోజులన్నీ కాళహస్తి గాలిగోపురం పాడుపడిఉండడానికి ఇదే కారణం అని పెద్దలు చెపుతారు.

—జంధ్యాల జానికిరామయ్య.

### ౧౧౩. 'పోలో' ఆట

'పోలో' ఆట ఆదిలో పెర్షియాదేశంలో కనుగోబడ్డదని చెబుతారు. పెర్షియాదేశాన్నుంచి అది క్రమంగా హిందూదేశానికి వ్యాపించింది. ఆంధ్రకవి పింగళి సూరన్న ఈ 'పోలో' ఆటను తన ప్రభావతీప్రద్యుమ్నకావ్యంలో వర్ణించియున్నాడు. ఈఆట హిందూదేశాన్నుంచే ఇంగ్లండు గ్రహించింది. ఆ గ్రహించడం 1870 లో జరిగింది. అనగా ఇంగ్లండులో మొదటిసారి 'పోలో'ఆట ఆసంవత్సరంలో ఆడేరన్నమాట.

—విద్యార్థి.

# ఏడువందలయేళ్లు యేకటాకీని యేకరాజవంశాధిపత్యంలో వుండిన

# ఆస్ట్రియా రిపబ్లిక్‌గా ఏల మారింది?

డిన లండనుమహానగరపు జనాభా అంతటి జనాభా !!

ఇప్పుడు వున్న స్థితిలో ఆరిపబ్లిక్‌కు పశ్చిమాన్ని స్విడ్జర్లాండు; తూర్పున జెకోస్లావాకియా, హంగరీ దేశాలు; ఉత్తరాన్ని జర్మనీ, జెకోస్లావాకియా దేశాలు, దక్షిణాన్ని ఇటలీ, యుగోస్లావియా దేశాలు సరిహద్దులై వున్నాయి.

ఈ ప్రశ్నకు సమాధానంతోపాటు

అసలు ఆస్ట్రియాకు ఆపేరు ఎట్లావచ్చింది ?
దాని రాజధాని అయిన వియన్నా విశేషమేముంది ?
హాప్సుబర్గు వంశస్థాపకుడు ఎవ్వరు ?
ఆస్ట్రియా హంగరీల కలయిక ఎట్లు కుదిరింది ?
మేరియ థెరిస్సారాణి మేటిపాలనం ఎప్పుడు ?
నెపోలియన్‌తో ఈరాజ్యసంబంధం ఎట్టిది ?
యుద్ధానికి పూర్వం ఆస్ట్రియాస్థితి ఎట్టిది ?
యుద్ధానంతరం దానిస్థితిలో వైపరీత్యం ఏమిటి ?

ఈ ప్రశ్నలకున్నూ సమాధానాలు ఈ వ్యాసంలో వున్నాయి.

1914 లో ప్రారంభమైన ఐరోపా మహాసంగ్రామం ఆస్ట్రియా దేశాన్ని, దాని సామ్రాజ్యాన్ని తారుమారు చేసినంత మూలముట్టుగా మరి ఏ దేశాన్ని చేయలేదు.

ఆస్ట్రియా హంగరీ సామ్రాజ్యం ఎంతటి విశాలమైంది! పశ్చిమాన్ని స్విట్జర్లాండు మొదల్చుకొని తూర్పున రష్యావరకూ—దక్షిణాదిని ఎడ్రియాటిక్ సముద్రమూ బాల్టిక్ రాష్ట్రాలూ మొదల్చుకొని ఉత్తరాన్ని పోలండు వరకూ ఒకటే సామ్రాజ్యం. అంతటి విశాలసామ్రాజ్యం యుద్ధానంతరం భిన్నాభిన్నమైపోయి ఆస్ట్రియాఒక్కటి ఒక చిన్నరిపబ్లిక్‌గా నిలిచిపోయింది.

116000 చతురపుమైళ్ళ విస్తీర్ణంగలిగి ముప్పయి మిలియనులకు మించిన జనాభాగలిగి మహనీయమైన ఆస్ట్రియన్ సామ్రాజ్యానికి గాను నేడు మిగిలివున్నది 32,000 చతురపుమైళ్ళ భూభాగం, ఆరున్నర మిలియనుల జనాభామాత్రమే. ఐర్లండుతో సమానమైన విస్తీర్ణం! పరిసరగ్రామాలతో కూ

మధ్యయూరప్‌కు ఆస్ట్రియా గుండెకాయ. ఆగుండెకాయకు రాజధానీనగరం వియన్నా. చుట్టుపట్టులవున్న అన్ని దేశాల రాచబాటలకు వియన్నా కూడలి. కాబట్టే అది అతిపురాతనకాలంనుంచీ యూరప్ ఖండచరిత్రలో అతిలోక ప్రఖ్యాతికాంచివుంది. తూర్పు యూరప్‌ను పడమటి యూరప్‌ను కలుపు మహానది డాన్యూబ్ ఒడ్డునే వియన్నావుంది. రైల్వేలకు కూడా వియన్నా గొప్పకూడలి అయి వుంది.

## ఆరు దేశాలనడుమను పడి సముద్రతీరంతో సంబంధం లేకుండావుండిన

# ఆస్ట్రియన్ రిపబ్లిక్, దాని సరిహద్దులు




అందుచేతనే — ఆస్ట్రియా పూర్వం కంటె పేదదీ, చిన్నదీ అయిపోయి ఏ మూలా సముద్రతీరంతో సంబంధంలేకుండా వున్నా వియన్నాకు యూరపియన్ రాజకీయాల్లో ప్రాముఖ్యం పోలేదు. వియన్నా పట్టణసౌభాగ్యాన్ని, ఆస్ట్రియా దేశ సౌందర్యాన్ని తిలకించడానికి ఏటేటా ఎందరో విదేశస్థులు వస్తూవుంటారు. జెకోస్లావాకియా రాజధాని అయిన ప్రెగ్‌పట్టణం కొంత, హంగరీ రాజధాని అయిన బుడాపెస్టు పట్టణం కొంత తన బ్యాంకింగు వ్యాపారాన్ని లాక్కునివున్నా- దేశం మొత్తంమీది జనాభాలో నాలుగోవంతు జనాభాను లోగొని రాజ్యం తాహతుకు మీరిన రాజధానీనగరం అయి వున్నా వియన్నా చరిత్ర, గానము, కళ, శాస్త్రము మొదలైన వానికి కాణాచిఅయి, జర్మన్ నాగరికతలోని ఉత్తమమైన దానికంతా కేంద్రస్థానమైవుంది.

ఆస్ట్రియారాజ్యం తొమ్మిదిరాష్ట్రాలుగా విభజింపబడివుంది. వియన్నా నగరం ప్రత్యేకం ఒకరాష్ట్రం. స్టిరియా, టైరోల్, లోయర్ ఆస్ట్రియా, అప్పర్ ఆస్ట్రియా, బర్గెన్‌లాండు, కారున్‌థియా, సాల్జుబర్గ్, వోరార్లబర్గ్ అనేవి మిగిలిన ఎనిమిది రాష్ట్రాలు.

ఆస్ట్రియాచరిత్ర చెప్పాలంటే ఇప్పటికి పన్నెండువందల సంవత్సరాల పూర్వాన్నుంచి ఎత్తుకోవాలి. అవి ఛార్లమెయిన్ రాజ్యం చేసే రోజులు. అతడు చాలా ఉద్దండుడు. ఇంచుమించు యూరప్‌నంతా ఒక ఛత్రంక్రిందికి తెచ్చిన చక్రవర్తి. అప్పటి అతని రాజ్యానికి తూర్పు కొసని ఉండే భూభాగం ఆస్ట్రియా. ఆస్టర్‌రీచ్ అని దాని జర్మన్‌నామం. ఆస్టర్‌రీచ్ అంటే తూర్పుకొస రాజ్యం అని అర్థం. ఆస్టర్‌రీచ్ అనే జర్మన్ పదం ఆంగ్లభాషలో ఆస్ట్రియా అయింది.

ఛార్లమెయిన్ విశాలసామ్రాజ్యంలో ఆస్ట్రియా బవేరియా డ్యూక్‌డమ్‌కు లోబడ్డ చిన్నరా

ష్ట్రం. క్రమంగా ఆస్ట్రియా వైశాల్యంలోనూ, ప్రాముఖ్యంలోనూ పెంపొందుతూ వచ్చింది. పదమూడవశతాబ్ది తుదిభాగంలో ఈ రాష్ట్రం గొప్ప వీరుడున్నూ, గొప్ప రాజకీయ వేత్తయున్నూ అయిన రుడాల్ఫు అనేవాని పాలనలోకి వచ్చింది. రుడాల్ఫు హాబ్సుబర్గు కౌంటు. అతనే అనంతరకాలంలో యూరపియన్ సామ్రాజ్యాల్లో మిక్కుమిగిలిన ఆస్ట్రియన్ సామ్రాజ్యానికి పునాదులు వేసిన వీరాధికుడు.

హాప్సుబర్గు వంశీకుడైన ఈ రుడాల్ఫు వంశస్థులే అతని మరణానంతరం 1291-వ సంవత్సరం మొదలు 1918 వరకు ఆస్ట్రియాను, తరుచుగా జర్మనీలోని విశేషభాగాన్ని ఏలుతూవచ్చేరు. రాజ్య పదవి తండ్రినుండి కొడుక్కీ, సోదరుని నుండి సోదరునికీ, పితృవ్యుని నుండి పుత్రునికీ సంక్రమిస్తూ వుండి వుండుగాక ఇంతకాలమున్నూ హాప్సుబర్గు వంశీయులే ఆస్ట్రియన్ సింహాసనంమీద అవిచ్ఛిన్నంగా వుంటూవచ్చేరు.

హంగరీ ఆస్ట్రియాకు పొరుగు రాజ్యం. హంగరీమీదికి తరుచు టర్కీవాళ్ళు దండెత్తి వస్తూవుండేవారు. 1526 లో మోహాక్సు వద్ద హంగరీకి టర్కీకి తీవ్ర యుద్ధం జరిగింది. ఆయుద్ధంలో హంగరీరాజు అతని సామంతులు హతమై పోయేరు. చేసేదిలేక ఆ నిస్సహాయస్థితిలో హంగరీ ఆస్ట్రియా శరణు చొచ్చింది. అదే ఆస్ట్రియా హంగరీ రాజ్య నిర్మాణం.

ఏకమైన కొత్తబలాన్ని కూర్చుకున్న ఈరాజ్యాన్నికూడా టర్కీవాళ్ళు పీడించడం మానలేదు. ఒకసారి వియన్నాకూడా టర్కీవారి చేతుల్లో పడిపోయేటంత దుస్థితికి వచ్చింది. ఆసమయంలో పోలెండు దేశపు రాజైన జాన్ జోబిస్కి ఆస్ట్రియాపక్షం వహించి టర్కీవాళ్ళను ఎదిరించి ఓడించి దూరంగా తరిమి కొట్టేడు.

టర్కీవాళ్ళు అపాయం కలిగిస్తారనే భయంచేత ఏకమైన ఆస్ట్రియా హంగరీ రాజ్యాలు మరిరెండు వందల సంవత్సరాలకు తర్వాత రాజకీయంగా మరీ సన్నిహితమైనాయి. అప్పటి హాప్సుబర్గు రాజు ఆరవచార్లసుకు పురుషసంతతిలేదు. 1740 లో అతను చనిపోతూ ఆస్ట్రియా, హంగరీ, తన ఇతర రాజ్యభాగాలు తనకూతురైన మేరియ థెరిస్సాకు ఇచ్చేడు. తాను చనిపోక ముందే ఛార్లెసు తన కూతురు హక్కుల్ని కాపాడ్డానికి ఇతర యూరపియన్ ప్రభుత్వాలవల్ల వాగ్దానాలు పొందేడు. కాని ఈ వాగ్దానాలు నిలవలేదు. అతని మరణానంతరం ఎవరికి అంకిన రాజ్యభాగాని వారు కబళించడానికి ప్రయత్నాలు సాగించారు.

మేరియ థెరిస్సా ప్రజ్ఞాధురీణ అవడంచేత వీరి ఈప్రయత్నాలేవీ సాగనీయకుండా అడ్డుపడింది. ఈ పనిలో ఆస్ట్రియా దేశస్థులేకాకుండా హంగరి ప్రజలున్నూ తమ రాణికి బాసటై నిలచారు. అందుతో విజయలక్ష్మి ఆమెనే వరించింది.

నెపోలియన్ చక్రవర్తి కాలంలో ఆస్ట్రియాకూడ అనేకమైన యూరపియన్ రాజ్యాలలాగే అతని కైవసమయింది. ఆస్ట్రియన్ రాష్ట్రమైన లొంబార్డీమీద అతను ఒకసారి దండెత్తేడు కూడాను. రష్యాయున్నూ, జర్మన్ రాజ్యాలకు నాయకత్వం వహించిన ప్రష్యాయున్నూ ఆస్ట్రియాకు సహాయపడ్డాయి. అయినా మారెన్గో, హొహాన్లిన్డన్ యుద్ధాలలో నెపోలియన్నే గెలిచాడు. ఆసందర్భంలో టైరోల్ రాష్ట్రాన్ని ఆస్ట్రియా ఫ్రెంచివారికి ఇచ్చివేసింది. పిమ్మట నెపోలియన్ వియన్నాపట్టణాన్నికూడా స్వాధీనం చేసుకున్నాడు. ఆస్టర్లిట్జ్ యుద్ధంలో ప్రతిపక్షుల్ని ఓడించివేశాడు. ఇది 1805 లో జరిగింది.మరి నాలుగేళ్ళ తరువాత వాగ్రామ్ దగ్గిర కూడ అతను విరోధుల్ని పరాజితులుగా చేశాడు. 1815 లో వాటర్లూ యుద్ధంలో నెపోలియన్ ఓడిపోయేవరకూ ఆస్ట్రియాను ఫ్రెంచి పీడ వదలనేలేదు.

మేరియ థెరిస్సాకాలంలోనూ, నెపోలియన్ కాలంలోనూ హంగరీ ప్రజలు ఆస్ట్రియాకు బాసటై ఉన్నా యుద్ధంలేని యితర కాలాల్లో వారికి విజాతీయుడయిన ఆస్ట్రి

[కొరవ ౮౧౧ పుటలో.

# నిష్కృతి

అత్తిలి సూర్యనారాయణమూర్తి

శాస్త్రి ధనతృష్ణ అనే సుడిగుండంలో పరిభ్రమిస్తున్నాడు. కనపడిన గడ్డిపఱకే తేల్చునని సాచిన అతని మునివ్రేళ్ళే బాహ్యలోక మవలోకించకల్గినది.

కొనసాగి ఆశాంతములంటిన అతని వాంఛాలతలు దేశోద్ధారకకీర్తిజ్యోత్స్నలో తానమాడినవి.

చిఱుత కూకటినాటి ముత్తవతల్లి బోధలిప్పు డాతనికి అచారాంకములైనవి.

ఆతఁడో! సర్వజీవార్తిహరుడగు వెజ్జు. 'ధనము, విద్యగూర్పదలప వలయు' నని నిత్యసహస్రగాయత్రి మనన మొనర్చును.

* * *

అతని శకట మప్పుడే పురబాహ్యప్రదేశమున కొకటి రెండు మైళ్లు దాటిపోవుచున్నది. ఆరాధారి కెడమకెలన చేతివేళ్ళ లెక్కకువచ్చు పూరిండ్లచుట్టుగల నారికేళవృక్షాగ్రములజుట్టి, సంజకెంజాయ అగ్నిప్రాకారమైంది.

గుండె లదరుచుండ రోజుకొనుచువచ్చిన అమలినాంబరధారి గొడబ ఆ అపరధన్వంతరి శకటాశ్వమునకు పెద్ద కంకరరాయి ఐరక్కున ఆపినది.

మఱుగుచున్న గుండెలోని కళవెళలే ప్రశ్నలకు సరియగు సమాధానములు. సంజ్ఞామాత్రమున శాస్త్రి వానితో వెనుక కడుగు లిడినాడు.

కూచిమంచివారి అగ్రహారమునగల తన స్వార్జితమగు 'మోతీఘర్'—అందుగల పేముకుర్చీలు— చలవతడికెలు మోబరల్లీ పేటలోని సంపన్న గృహస్థుల్లా, తాలూకా అధికార్ల భవనాల్లో ఆతనికిగల మంచిపేరే ఆత డెఱిగున్నది. మించి, అమలాపురం నల్లవంతెనదాటి ప్రక్కతోపులలోని దృశ్యాల కాతడలవడు నవకాశము లెన్నో ఆతఁడు జాఱవిడిచినాడు—

ఆ కూలి కుఱ్ఱని దీనదృక్కులు జేరిన వాతని నిప్పుడు. టార్చిలైటుకు సన్నిహితబంధువై జ్ఞానదీపం బెన్నడూ ఆత డెఱుగని, ఆతని తలపుచొఱని విషయముల ఆతని ముందుపెట్టినది.

పలుచని చర్మముచే నంటింపబడిన కంకాళమూర్తులు!!! లోకదైన్యమెల్ల గభీరరూపత ఆదరిద్రనారాయణుల కనీనికల దాక్కున్నది! ఈతరుప్పల అశిరోజాలెన్నడూ తైలసంపర్క మెఱుగవు. వెలగకాయ నొక్కినట్లు ప్రకృతి వారి వదనగహ్వరముల అంటగట్టి వేసినది.

శాస్త్రికళ్లు తిరిగిపోయినవి. ఆత డొకనిముస మేమీ మాట్లాడలేక పోయినాడు...

చప్పున తృణశయ్యలందు కొంగిలింతల నున్నవారివద్ద వాలినాడు. వారి గుండెలపై చెవినాన్చి పదినిముసము లట్టే వుండిపోయినాడు.-

శాస్త్రి మొగమున ఆశ నిరాశలొకదానివెంట నొకటి విద్యుద్వేగంలో గంతులిడ జొచ్చినవి.—

ఒక్క వురుకున తానెక్కివచ్చిన బండి కడకేగి అందుగల తోలుసంచి నెత్తికొని మరల నాగుడిసె జేరినాడు. ఓ సీసా మూతతీసి వారి నాసికారంధ్రములకడ నొక త్రుటి నిల్పి, మరేదో మందు వారివదనముల బలవంతమున తెఱచి పోసినాడు.

జేబునుండి యొక రూకతీసి, తానక్కడకు వచ్చుటకు కారకుడగు నా యంత్యజున కిడి, నారింజ పండ్లు కొన్ని దేబనిచినాడు!—

* * *

ఆరాత్రి కాపల్లెలోని యా పూరిల్లే ఆతనికి స్వర్గధామమైనది. ఆతని కృషికి దైవ మనుకూలించినది. ఎన్నడెఱుగని మహదానంద మాతని, యింకింత వానిగ నొనర్చినది. ఆత డిప్పుడు ఫక్తు హరిజనసేవకుడై దీనబాంధవుడైనాడు. హరిజనపల్లెలే ఆతని కిప్పుడు విహారభూములు—ధన మాతని మురిపించుట మానినది—సేవ నిత్యజీవనమైనది.

అన్నట్టు : 'మోతీఘర్' 'హరిజనమందిర'మై, తీర్థమువలె ప్రజలతోకలకల లాడుతూన్నది నేటికీ.

## ఇరవైయేళ్లగా వుంటూవుండిన తీవ్రవాంఛ ఇప్పటికి నెరవేరింది

# ఆస్ట్రియా జర్మనీలో చేరింది

యుద్ధానంతరం ప్రత్యేకంగా ఏర్పడ్డ ఆస్ట్రియా, హంగరీ దేశాలు రెండున్నూ కాథలిక్ మతానికి చెందినవే. కాని హంగరీప్రజలు ప్రబలంగా మాగ్యార్ జాతికి చెందినవారు, ఆస్ట్రియన్ ప్రజలు ప్రబలంగా—నూటికి తొంభై ఏడుగురుదాకా—జర్మన్‌లు. కాబట్టే వీరు జర్మనీలోని ప్రజలతో జాతి, సాంప్రదాయం, విజ్ఞానం మొదలైనవానితో కట్టుబడివున్నారు.

హంగరీప్రజలకు హంగరీ రాజ్యం స్థిరంకావలనీ, దినదినాభివృద్ధి కాంచాలనీ తీవ్రమైన కోరిక వుంటుంది. కాని ఆస్ట్రియన్ ప్రజల్లో చాలామందికి తమరాజ్యం ప్రత్యేకంగావుండి పలుబాములు పడ్డంకంటె జర్మనీతో కలిసి పోవడం మంచిదని ఉంటుంది.

జరిగిన సంధులు, పుట్టిన సంధిపత్రాలుకూడా ఆస్ట్రియా కష్టాన్ని ఇనుమడింపచేసి జర్మనీలో కలిసిపోవాలనే ఆప్రజల కోరికలని మరింత వృద్ధిచేశాయి.

నేటికి ఇరవై సంవత్సరాలకి పూర్వం అనగా 1918లోనే ఆర్మిస్టిస్ అయిన కొత్తలోనే ఆస్ట్రియా ప్రజలికి జర్మనీలో కలిసిపోదామని వాంఛ పుట్టింది. కాని మిత్రమండలివారు అడ్డుతగిలారు.

యుద్ధానంతరం ఆస్ట్రియా సరిహద్దులు కుంచింపబడ్డాయి. ఈ ఇరవై సంవత్సరాలనుంచీ అది ఒకసారిన్నీ స్థాయీభావాన్ని పొంది మంచి ప్రభుత్వాన్ని సంపాదించలేక పోయింది.

అసలుకు మించిన కొసరులాగ తన తాహతుకుమీరిన పెద్దపట్నం వియన్నా రాజధాని. అసలు వియన్నాయే ఆస్ట్రియాకు ఒక సమస్య అయింది. చిన్న దేశం ఇంతటి పెద్ద పట్టణాన్ని ఎల్లా పోషిస్తుంది?

ఇంతకు పూర్వం వియన్నా మొదలైన పారిశ్రామికపట్టణాల్లోని ప్రజాసమూహానికి ఆహారపదార్థాలు హంగరీనుంచి వచ్చేవి. ఇప్పుడు హంగరీ పరాయిరాజ్యం. డబ్బు ఇస్తేకాని సరుకుఇవ్వదు.

ఇదివరకు ఆస్ట్రియాలో వుండిన బొగ్గుగనులన్నీ ఇప్పుడు జెకోస్లావాకియాకు పోయాయి. కాగా బొగ్గుకు కఱువు ఏర్పడి ఆస్ట్రియాలో కొంతకాలం ఫ్యాక్టరీలు, రైళ్లు నడవడం కష్టమైపోయింది.

పరిశ్రమలు, సరకుల రాకపోకలు స్తంభించేయి. డబ్బు లేదు. ఉన్నడబ్బు కాస్తా ప్రజలు ఆహారపదార్థాలకు వెచ్చించేవారు. బ్యాంకుల్లో ఏమీ వేశేవారుకారు. ఆమూలాన్ని బ్యాంకింగు వ్యాపారమున్నూ మూలపడింది. పుష్టికరమైన ఆహారంలేక పిల్లలున్ను, సలివాళ్లు వందలకొద్దీ చనిపోయిరి.

యుద్ధానంతరం ఆస్ట్రియాలో మొదటిసారి 1919 లో సమావేశం అయిన నేషనల్ ఎజెంబ్లీ మిగిలివున్న ఆస్ట్రియాదేశాన్ని కొత్తగా ఏర్పడిన జర్మన్ రిపబ్లిక్‌లో కలిపివేయాలని కోరింది.

కాని మిత్రమండలివారికి ఇది నచ్చలేదు. ఆస్ట్రియా జర్మనీతో కలిస్తే మధ్యయూరప్‌లో తిరిగి జర్మనీకి ప్రబలమైన పలుకుబడి కలుగుతుందని భయపడ్డారు.

1920 లోను, 1921 లోను కూడా ఆస్ట్రియా జర్మనీతో కలవడానికి ప్రయత్నించింది. కాని మిత్రమండలివారు ముఖ్యంగా ఫ్రెంచివారు ఈ ప్రయత్నాల్ని సాగనియ్యలేను.

ఈస్థితిలో ఆస్ట్రియా జాతిసమితి శరణుచొచ్చింది. ఆస్ట్రియాను స్వతంత్రంగానిలిపి జర్మన్ ఆధిక్యాన్ని పెరగకుండా చేద్దామనే ఉద్దేశంతో జాతిసమితిలో పెత్తనం చెలాయించే ఫ్రాంసు, ఇంగ్లండులు ఆస్ట్రియాకు అప్పు పెట్టేయి. ఈ అప్పుపెట్టడంలో ఇటలీ, జెకోస్లావాకియాలు ఫ్రాంసు, ఇంగ్లండులకు తోసట.

ఈఅప్పుతో అయినా పులుసూ, ముద్దా పూర్తిగా దిగలేదు, తిరిగి అప్పుకావలసివచ్చింది, లెక్కా

# స్వాతంత్ర్యం సమసినా స్వజాతి అయిన జర్మనీతో చేరడం ఆస్ట్రియాకు ఎంతో మంచిది

డొక్కా జాతిసమితిపరీక్షకు అందించే షరతుతో తిరిగి అప్పు ఈయబడింది. లీగ్ ఏర్పాటుచేసిన కమీషనరు ఆస్ట్రియన్ ఖజానాకు సూపరింటెండెంటు.

జర్మనీతో కలిసే ప్రయత్నం పూర్తిగా విడనాడే షరతుమీదే 1922లో ఆస్ట్రియాకు అప్పు ఈయబడింది. గత్యంతరంలేక ఆస్ట్రియన్‌లు దానికి ఒప్పుకున్నారు.

కాని వియన్నానగరవాసులకున్నూ, ఆస్ట్రియన్ గ్రామవాసులకున్నూ పొత్తుకుదరలేదు. రాజధానీనగరవాసుల ప్రాబల్యాన్ని గ్రామవాసులు సహించలేక పోయారు. గ్రామాలనుంచి వియన్నాకు ఆహారపదార్థాలు పంపడానికికూడా ప్రజలు ఒకసారి నిరాకరించారు. 1927 లో ఆస్ట్రియాలో సివిల్‌యుద్ధం వస్తుందేమో అన్నంతవరకు పరిస్థితులు విషమించాయి. కార్మికుల సమ్మెలు మిలటరీ వస్తేగాని సడలలేదు.

1931 లో ప్రపంచాన్ని ఆర్థికమాంద్యం ఆవహించింది. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు అసలే అటమటిస్తూన్న ఆస్ట్రియాకు ఈ ఆర్థికమాంద్యంలో తట్టుకోవడం దుస్తరం అయింది. గత్యంతరంలేక 1931–వ సంవత్సరం మార్చి 19 తేదీని తిరిగి జర్మనీతో కలవడానికి ప్రయత్నించింది. ఉద్దేశించిన ఐక్యత ఒక్క ఆర్థికవిషయంలోనే—ఆస్ట్రో జర్మన్ కస్టమ్స్ యూనియన్. కాని దీన్నికూడా ఫ్రెంచివారు కాదన్నారు. ఆర్థికంగా ఇప్పుడు జరిగిన సమ్మేళనం రేపు రాజకీయంగా కూడా జరగవచ్చును కాబట్టి ఇది సుతరాం వల్లకాదని ఫ్రెంచివారు పట్టుపట్టేరు. ఐక్యతకు అంగీకరించకుండా అవతల జర్మన్ ప్రభుత్వాన్ని, ఇవతల ఆస్ట్రియన్ ప్రభుత్వాన్ని ఒత్తిడిచేశారు.

ఇట్లు ఆస్ట్రియా జర్మనీలు కలియడం సంధిషరతులకు విరుద్ధం కాదా అనేవిషయాన్ని హేగ్‌కోర్టు విచారణకు పంపేరు. కోర్టు ఏమిచెప్పినా ఆస్ట్రియా, జర్మనీ కలియడానికి మేము ఒప్పుకోమని ఫ్రెంచివారు ముందుగానే చెప్పేశారు. హేగ్ కోర్టువారున్నూ ఆస్ట్రోజర్మన్ కలయిక సంధిపత్రాలికి విరుద్ధమన్నారు.

జర్మనీలో డాక్టర్ బ్రూనింగ్సు ప్రభుత్వం అందుతో ఆవిషయాన్ని వదిలేసింది. ఆస్ట్రియా ఎప్పుడూ జర్మనీతో కలవడానికి ప్రయత్నించచనని నమ్మబలికి మళ్ళీ జాతిసమితి వద్ద అప్పు తీసుకుంది.

ఇంతలో జన్మచేత ఆస్ట్రియాకు చెందిన హిట్లరు జర్మనీ నియంత (1933 జనవరిలో) అయినాడు. అతని నాజీపార్టీకి ఆస్ట్రియాను జర్మనీతో కలపడం ముఖ్యోద్దేశాలలో మొదటిది.

కాని అప్పటికి ఆస్ట్రియన్ ఛాన్సలరుగావున్న డాల్ఫస్ పార్లమెంటును రద్దుచేసి నిరంకుశాధికారం వహించి ఫాసిస్టుఇటలీసహాయంతో ఆస్ట్రియాలో నాజీపరివర్తనం రాకుండా చేశాడు.

ఇటలీ, జర్మనీలు రెండూ ఫాసిస్టు సిద్ధాంతాలమీద నడపబడుచుండేవి కావడంచేత ఈరెండు దేశాల నడుమను వుండిన ఆస్ట్రియా జర్మనీతో కలిస్తే ఇటలీ, జర్మన్‌రాజ్యాలు సన్నిహితమౌతాయి కాబట్టి ఆస్ట్రియా జర్మనీతో కలియడానికి ఇటలీ ఒప్పుకోకపోవడం అంటూ వుండదని కొందరు అనుకోవచ్చు. కాని ఇటలీనియంత అయిన ముసోలినీకి ఆస్ట్రియా జర్మనీతో కలియడం అందుమూలాన మధ్యయూరప్‌లో జర్మన్ పలుకుబడి అతిశయించడం ఇష్టంలేదు. అందుచేత ముసోలినీ డాల్ఫస్‌కు మద్దతుగావుండి ఆస్ట్రియా జర్మనీతో ఐక్యంకాకుండా చూచేవాడు.

అందుచే 1934 లో ఆస్ట్రియాను స్వాహాచెయ్యడానికి హిట్లర్ చేసినప్రయత్నం నెగ్గలేదు. 1934

[కొరవ ౪౦వ పుటలో.

**ఆయుర్వేదము నుద్ధరించుట యెట్లు?**

ఆయుర్వేదము ను బునరుద్ధరింపవలసిన బాధ్యత కొంత వైద్యవరులమీఁదను, కొంత సంపన్న దేశీయులమీఁదను, కొంత పత్రికాసంపాదకులమీఁదను బడియున్నది. ఈమూఁడుజాతులవారు నెప్పుడు పూనుకొని సర్వాధారము, ప్రాణదాయకము నగు నాయుర్వేదమును పునరుజ్జీవింపఁ జేయుదురో అప్పుడే ఆయుర్వేదమునకు యథాగౌరవము రాఁగలదు. అప్పుడే ఆయుర్వేదము తక్కుంగల కళలతోపాటు గౌరవింపఁబడఁగలదు. ఆయుర్వేదమునకు ఆంధ్రవైద్యులు చేయవలసిన కార్యము లసంఖ్యముగా నున్నవి.

పాశ్చాత్యవైద్యులు "కేసు డైరీ"ని వ్రాయుచు దానిలో నేరోజు చేసిన చికిత్స ఆదినమున సువిశదముగా వ్రాయుచున్నారు. ఇది మంచిపద్ధతి. ఇది ఆంధ్రవైద్యులలో గూడ నడపటడప అవలంబించుచున్నారు. ఈ సద్వ్యవసాయము ఇతోఽధికాభివృద్ధి గాంచవలసియున్నది. ఈ "కేసు డైరీ" వ్రాయుటవలన రాఁబోవు వైద్యసోదరుల కిది ఆదర్శప్రాయముగనుండి చికిత్సలు చేయుటలో నొక సులభమార్గ మేర్పడును.

ఆయుర్వేదవైద్యులు ఎవరు చేసినవైనను అద్భుతచికిత్సలు పత్రికలద్వారానో లేక డైరీద్వారానో తెలుపుడు చేయుచుండవలయును. లేనిచో నాచికిత్సలన్నియుఁ గాలగర్భమందడఁగుటయే గాక ఆయుర్వేదము అభివృద్ధమగుట కవకాశముండదు. ఆయుర్వేద వైద్యులు చిత్రామయములను ప్రకటించు ప్రతిక నొకదానిని వెంటనే స్థాపించి అనుభూతచిత్రామయచికిత్స లాపత్రికలో ప్రకటించుచుండవలయును. ఈవిధముగా జేయుటవలన ప్రతిసామాన్యవైద్యసోదరునకును సులభముగా చికిత్సానైపుణ్యము కలుగును.

ఆయుర్వేదము తగినంత యభివృద్ధి అచిరకాలములో బడయవలయుననినచో పత్రికాసంపాదకులు శ్రద్ధగాఁ బనిచేయవలసియున్నది. ఇప్పుడు మనదేశమున నున్న తెలుఁగుపత్రికలలో చాలవఱకు రాజకీయము, చిత్రకళ, సంగీతము, సారస్వతము ఇత్యాదులకే తావీయబడుచున్నది గాని ఆయుర్వేదమున కంతగా తావీయబడకపోవుట ఆయుర్వేదవైద్యుల దురదృష్ట మనక తప్పదు.

అనుభవజ్ఞు లభిజ్ఞులునగు ఆచంట లక్ష్మీపతి, శ్రీమాన్ కృష్ణమాచార్యులు, వేటూరి శంకరశాస్త్రిలు ఇత్యాదులు పూనుకొని గొప్పపత్రిక నొకదానిని ఆయుర్వేదముకొఱకు త్వరలో స్థాపింపవలసియున్నది. ఆయుర్వేదము అతిహీనస్థితిలో నున్నది. దీనిని వెంటనే ఉద్ధరించిన గాని లాభములేదు. దాని ఉద్ధరణమునకు ఆయుర్వేదవైద్యులు కేసు డైరీ వ్రాయు ఆచారము నవలంబించుట, భిషగ్రత్నములు ఆయుర్వేదపత్రిక నెలకొల్పుట ముఖ్యము.

——మధునాపంతుల
సత్యనారాయణశాస్త్రి.

* * *

**బాల్యవివాహములు ఎట్లేర్పడినవి?**

ప్రాచీనకాలమున క్షత్రియకన్యను బ్రాహ్మణులు, బ్రాహ్మణకన్యను క్షత్రియులు వివాహమాడెడువారు. ఇందులకు దేవయాని, లోపాముద్ర, మున్నగు సాధ్వీమణులయొక్క చరిత్రములే సాక్షి.

క్షత్రియులు తమ కన్యలకు, పదునారు, పదునెనిమిది సంవత్సరముల ప్రాయమున స్వయంవరమనుపేర తమ విద్యారూపలావణ్యాదుల కీడగు పురుషు నెన్నుకొనుటకు అవకాశ మొసగెడువారు. బ్రాహ్మణులును తమకన్యలకు యుక్తవయస్సు ప్రాప్తించిన పిమ్మట వివాహములు చేసెడు ఆచార ముండెడిది.

కాని మహమ్మదీయ యుగములో, ఆ యాచారము నశించి బాల్యవివాహము లేర్పడినవి. హిందూమతధ్వంసమునకు గంకణము గట్టుకొని తన్మతస్థులు తమకంటికి గనబడిన హిందూకన్యల నెల్ల చెరబట్టెడివారనియు, అందువలన వారి బారినుండి కాపాడుకొనుటకై ఘోషాపద్ధతి, బాల్యవివాహములు ఏర్పరుపబడినవనియు పెక్కువిద్వాంసుల తలంపు. ఏదియెట్లున్నను, కన్యలకు పుట్టుటయే తడవుగ వివాహ మొనర్చెడు నాచారమాకాలముననే ప్రారంభమైనదనుట నిస్సంశయము. కాలక్రమమున మహమ్మదీయ పరిపాలన నశించిపోయిననూ, ఈ ఆచారముమాత్రము ఆచరణయందే యున్నది. ఆనాడు మానరక్షణకై ఏర్పడిన పద్ధతి రానురాను కట్టుబాటుగల ఆచారమై 'అష్టవర్షాత్ భవేత్కన్యా' అని కన్యకు ఎనిమిదవ సంవత్సరమందే వివాహము చేయనియెడల, కన్యాదానఫలము దక్కదనిరి.—చుండూరి రమాదేవి.

* * *

## మణిమాల

**హైదరాబాదుతో ఆంధ్రుల సంబంధము**

'భారతదేశము యొక్క వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయ చరిత్రలో హైదరాబాదు చాల ప్రధానస్థానము వహించుచున్నది. ముఖ్యముగా ఆంధ్రజనులతోటి సంబంధములో ఈప్రాముఖ్యత ఎక్కువగానున్నది.

చపలమైన చరిత్ర దైవము చీలికలుగ జేయనంతవరకు ఉత్తరసర్కారులును, దత్తమండలములును ఈ రాష్ట్రములో నొకభాగమై యుండెను. అవి ఇప్పటికిని భాగముగనుండియున్నచో హైదరాబాదుసంస్థానము చాలమట్టుకు సంపూర్ణముగా, ఎట్లయినను అధికభాగమైనను ఆంధ్రసంస్థానముగా నుండియుండెడిది. నేటికిని తెలంగానా ఈరాష్ట్రములో ఎక్కువ భాగమైయున్నది. మహోఘనత

# మణిమాల

వహించిన ప్రభువు గారియందు భక్తి విశ్వాసములు కలిగియుండు ఆంధ్రులు ఈరాష్ట్రివాసులలో అధికసంఖ్యాకులై యున్నారు. ఆంధ్రులచరిత్రయొక్క ఆధారములు నేడు మీ సరిహద్దులకు లోపలనున్నవి. వరంగల్లు కాకతీయ రాజవంశముయొక్క రాజధానినగరముగ నుండెను. అక్కడినుండి చరిత్ర మూడు ప్రవాహములుగ చీలి విజయనగరసామ్రాజ్యమును; కొండవీడు, రాజమహేంద్రవరముల రెడ్డిరాజ్యమును; వెలమరాజ్యమును ఏర్పడినవి.

సారస్వతచరిత్రలోను వరంగల్లు పోతన మహాకవి భాగవతపురాణమును తెలుగు చేసిన స్థలముగ వాసికెక్కినది.

అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణోపాఖ్యానమును గోలకొండ ఇబ్రహీం కుతుబుషాకు అంకితముచేసెను.

తెనుగులో ఇబ్రహీమును మల్కిభరామని నాడు. ఆతడు భారతదేశీయ హిందూకథను విన కుతూహలుడై యుండినట్లు వర్ణించబడియున్నాడు. సంస్కృతపదములు గాని, సంస్కృతభవములైన పదములు గాని వేయక అచ్చతెలుగులో రచించబడిన మొదటికావ్యమగు యయాతిచరిత్రము దాని కవియగు పొన్నిగంటి తెల్గన్నచే ఇబ్రహీం కుతుబుషాయొక్క అధికారులలో నొకరగు అమీల్ ఖానునికి అంకితము చేయబడినది.

మట్చక్రవర్తి చరిత్రయొక్క రచయితయు, సుప్రసిద్ధకవియు నగు మల్లారెడ్డి తాను ఇబ్రహీం మల్కియొక్క ఆస్థానమునకు ఆహ్వానముపైపోయి చూచివచ్చినట్లు వర్ణించియున్నాడు.

దక్కనుచరిత్రలో అక్కన్న మాదన్నల పేర్లు ప్రసిద్ధములైనవి. వారలు గోలకొండసుల్తానులలో కడపటివాడగు తానీషాయొక్క ప్రధానమంత్రియు, సేనానాయకాధిపతియు నైయుండిరి. అక్కన్నయొక్క ముగ్గురు మేనల్లుండ్రును గోలకొండరాజ్యములో గొప్పబాధ్యతతో కూడిన అధికారపదవులయందుండిరి. వారలలో గోపన్నయొకడు. అతడే భద్రాచల ప్రసిద్ధిగాంచిన రామదాసు. నేటికిని గోలకొండకు పోవువారికి అక్కడ రామదాసు భద్రాచల దేవాలయమును అలంకరించుటకును, ఆ దేవాలయమందలి విగ్రహములకు విలువగల సొమ్ములు చేయించుటకును రాజ్యద్రవ్యమును కాజేసినందుకై శిక్షితుడైయుంచబడిన కారాగారము చూపబడుచున్నది. రామలక్ష్మణులు తానీషావద్ద రామదాసు దూతలుగ ప్రత్యక్షమై అతనికీయవలసిన డబ్బిచ్చినట్లును, అంతట తానీషావద్దకు మానవరూపమున వచ్చినవారలు దేవతలని గ్రహించి తన అదృష్టమునకు సంతోషించి, భగవంతుడట్లు తనపై కృపారసమును వెదజల్లెనని ఆనందపరవశుడైనట్లును కథగలదు. ఇది హిందువులును ముసల్మానులును ఎట్లు ఒక్కఆత్మవలె మెలగుటకు ప్రారంభించిరో చూపుచున్నది. తానీషాయొక్క పేరు హిందువులు గౌరవించు పేర్లపట్టికలో కెక్కినది.

ఈ రాష్ట్రిరాజధానియే తెలంగానాలో నుండుటయు నాకు సంతోష మొనగూర్చుచున్నది. ఈ గొప్పరాష్ట్రిమునకు సంబంధించిన ప్రధాననగరసంబంధములైన కార్యములన్నిటికిని మేముస్థానమని ఆంధ్రులమగు మేము గర్వించుచున్నాము. (సి.ఆర్. రెడ్డిగారిఉస్మానియా యూనివర్సిటీ స్నాతకోపన్యాసమునుండి.)

—గోలకొండపత్రిక.

* * *

## భ్రమరకీటన్యాయము

భ్రమరమనునది మట్టితో గూడుకట్టి యాగూటిలో నాకు పచ్చపురుగులను తెచ్చిపెట్టి యాగూటివద్ద శబ్దము చేయుటవలన పురుగులు క్రమముగా భ్రమరములగుచున్నవనియు నందుచేతనే భ్రమరకీటన్యాయ మేర్పడినదనియుఁ జెప్పుదురు.

ఈమాటలు వినినప్పుడు నా కాశ్చర్యము గలుగుచుండెడిది. నేను దీనిని పరిశీలించితిని. భ్రమరము మొట్టమొదట మట్టినిదెచ్చి బొంగరమువలె చిన్నగూటిని రంధ్రముపెట్టి కట్టును. ఆగూటిని పూర్తి చేసినవెనుక తనతోకను గూటిలో జొప్పించి పైకట్టుగా తనవీర్యమును అతికించును. ఈపని ఐదాఱు నిముషములలో జరుగును. ఆవీర్యము బియ్యపుగింజవలె కొంచెము సన్నగా నుండును. దానిని మనము పుల్లతోఁ దాకినయెడల నది చలించును, కావున దానియందు జీవకళయున్నదని గ్రహింపవచ్చును.

తనవీర్యము పరిణామము పొందుటకుగాను భ్రమరము పచ్చని ఆకుపురుగులను తెచ్చి ఆగూటిలో ఐదాఱు మొదలు ఏడెనిమిదివఱకు దూర్చి మట్టినిదెచ్చి యా రంధ్రమును మూసివేయును. భ్రమరము పనిఅంతటితో పూర్తియగును. అటుపైన నది గూటివద్దకే రాదు. వచ్చినను దానిని గమనించదు. వేరేగూటిని తయారుచేయును. గూటిలోనుండు వీర్యము భ్రమరముగా మాఱుటకు 4 వారములు పట్టును.

దినములు పూర్తికాగానే తనంతట తానే భ్రమరమందుండి బయలుదేఱి పైకెగిరిపోవును. ఆగూటిలోనుండు పురుగులు నశించిపోవును. ఒక్కగూటినుండి ఒక్కభ్రమరమె కలుగుచున్నది. కీటకములు భ్రమరములుగా మాఱునది నిజమైనయెడల నొక్కగూటికే డెనిమిది భ్రమరములుత్పత్తి కావలెను. అట్లు గలుగుటలేదు. ఒక్కొక్కగూటిలోను వీర్యము నశించి పొల్లువలెనుండును. ఆగూటిలోనుండు పురుగులు నశించిపోయియుండును. భ్రమరము వీర్యమే భ్రమరమగుచున్నది గాని పచ్చపురుగులు భ్రమరములుగా మాఱుటలేదు. (తెనుగుతల్లి.)

—వావిల్తోట మునిరెడ్డి

౪౦౩ పుట తరవాయి]
జూలైలో ఆస్ట్రియన్ నియంత డాల్ఫస్ హత్యచేయబడ్డాడు.

రిపబ్లిక్‌గా ఏర్పడినప్పటినుంచీ కూడా ఆస్ట్రియా తనకాళ్ళమీద తాను నిలబడలేక పోతూవుంది. అందుచేత అది ఇంకోదేశంతో కలిసిపోవడం మంచిదనే వాదం బయలుదేరి తీవ్రమైంది.

ఆస్ట్రియా ఇటలీతో కలిసిపోవడం మంచిదనే వాదం ఒకటి. కాని ఈదేశం ఇటలీతో కలిసిపోవడం ఫ్రాంసు, బ్రిటన్‌లకుగాని, రుమేనియా, యుగోస్లావియా, జెకోస్లావాకియా దేశాలకికాని ఇష్టం లేదు. ఈవిషయంలో 1933 సెప్టెంబరు 29-వ తేదీని ముసోలినీ ఒక మెమోరాండంకూడా ప్రకటించాడు. అయినా లాభంలేకపోయింది.

ఆస్ట్రియా, హంగరీ, జెకోస్లావాకియా, రుమేనియా మొదలైన డాన్యూబ్ రాష్ట్రాలిని అన్నిటినీ ఒక ఫెడరేషన్ రాజ్యంగా మారుద్దామనే వాదం ఒకటి బయలుదేరింది. దీనికి ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు అంగీకరించారు. కాని ఇందుకు ఇటలీవారు ఎంతమాత్రం అంగీకరించకపోవడంచేత ఇది నెరవేరింది కాదు. ఈఫెడరేషన్ వస్తే ఎప్పటికేనా ఆస్ట్రియాను కబళిద్దామనే తనకోరిక నెరవేరదు కాబట్టి జర్మనీ దీనికి వ్యతిరేకం.

ఆస్ట్రియా హంగరీలను తిరిగి కలిపివేయడం మంచిదనే వాదం మరొకటి. లిటిల్ ఎంటెంటే రాజ్యాలయిన రుమేనియా, యుగోస్లావియా, జెకోస్లావాకియా ఇందుకు ఎంతమాత్రం ఒప్పుకోలేదు, తమలో ఏఒక్కరాజ్యంకంటె దాని పలుకుబడి విస్తరిస్తుందని. జర్మనీకూడా అంగీకరించలేదు. అసలు ఆస్ట్రియా హంగరీ దేశాల్లోనే దీనికి ఆనుకూల్యం లేకపోయింది.

ఆస్ట్రియాకు తిరిగి హాప్సుబర్గు రాజవంశాన్ని తీసుకురావాలని వేరొకవాదం. దీనికి ఆస్ట్రియన్ ప్రజలే కాకుండా ఇతరరాజ్యాలవారున్నూ సమ్మతించలేదు.

అన్నిదేశాలు అంగీకరిస్తేగాని ఆస్ట్రియాసమస్య తీరదు. కాని అన్నిదేశాలు ఆస్ట్రియావిషయంలో అంగీకరించడం కలలోవార్త అయింది. తీరని సమస్యగా వుండిపోయిన ఆస్ట్రియన్ సమస్యను హిట్లరు గతమాసంలో తీర్చేశాడు.

స్వాతంత్ర్యం సమసిపోయినా జర్మనీతో చేరిపోవడం ఆస్ట్రియాకు మంచిదే. ఆస్ట్రియన్ ప్రజలు జర్మన్ ప్రజలు ఒకే భాషను--జర్మన్ భాషను- మాట్లాడేవారే. జర్మనీలో ప్రొటెస్టెంటు మతమూ, ఆస్ట్రియాలో కాథొలిక్ మతమూ ఉన్నా మిగతా చరిత్ర, సాంప్రదాయం, ఆచారవ్యవహారాలు ఏకజాతీయమైనవే. ఏదో దేశంతో కలియకతీరనప్పుడు తనతో సన్నిహితసంబంధంవున్న జర్మనీతో చేరడమే ఆస్ట్రియాకుమంచిది.

జర్మనీ ఆస్ట్రియాల కలయిక ఈనాటిదికాదు. పూర్వం ప్రఖ్యాతమైన హోలీరోమన్ ఎంపైర్‌లోని జర్మన్ రాష్ట్రాల్లో ఆస్ట్రియా ఒకటి. సాంప్రదాయకంగా, రాజకీయంగా, ఆర్థికంగా రెండుదేశాలకున్నూ చిరసంబంధంవుంది. హోలీరోమన్ సామ్రాజ్యం ఒకవిధంగా జర్మన్‌సామ్రాజ్యమనే చెప్పవచ్చు. ఆనాటి చక్రవర్తులు తరుచుగా ఆస్ట్రియా మొదలయిన జర్మన్ రాష్ట్రాల్లోనే వుంటూవుండేవారు. ఈసాంప్రదాయమే మొన్నటి ఐరోపియన్‌యుద్ధములో ఆస్ట్రియా జర్మనీలను ఏకంచేసింది. ఆయుద్ధానంతరం పుట్టిన సంధిపత్రాలు వాటిని విడదియ్యడానికి ప్రయత్నిస్తే మాత్రం అపయత్నాలు తుదముట్టేవి ఎప్పుడూ కానేరవని ఈనాటి చరిత్ర మళ్ళీ ఆ చారిత్రకసత్యాన్ని ఘోషిస్తూవుంది.

1934 లో హత్యచేయబడ్డ డాల్ఫస్ అనంతరం ఆస్ట్రియాలో షూసిగ్ ఛాన్సలరైనాడు. ఆదేశంలో వున్న నాజీపార్టీ నిషేధాలని అట్లనే నిలిపివుంచినా షూనిగ్ 1936 లో హిట్లరుతో సంప్రదింపులు సాగించాడు. అందుతో ఆదేశంలో నాజీల పలుకుబడి కొంచెం బలిసింది.

నేటి ప్రపంచపు రాజకీయ విషమస్థితి గమనించి హిట్లరు ఫిబ్రవరిలో షూనిగ్‌ను బెదరించి ప్రభుత్వంలో నాజీలకుస్థానాలు ఇప్పించేడు.

స్వేచ్ఛవచ్చినా నాజీలు ఊరుకోక పెచ్చరిల్లారు. షూనిగ్ గడబిడకు తట్టుకోలేక ఆస్ట్రియా స్వాతంత్ర్యవిషయమై ప్లెబిసైట్ తీసు

పోడానికి ప్రకటన చేశాడు.

ఆప్లెబిసైట్‌ను ఆపమని జర్మనీ ఆజ్ఞాపించింది. బలప్రదర్శనంకూడా చేసింది. దేశాన్ని రక్తపాతంలో ముంచడం ఇష్టంలేక షూనిగ్ రాజీనామాయిచ్చేడు. ఆస్ట్రియన్ ప్రభుత్వం నాజీల హస్తగతమైంది. హిట్లర్ విజయగర్వంతో వియన్నాలో ప్రవేశించాడు.

రిపబ్లికన్ ప్రెసిడెంటు మార్క్లాస్ రాజీనామా ఇచ్చేడు. నాజీనాయకుడు డాక్టర్ ఇన్‌క్వార్టు ప్రెసిడెంటు అయినాడు. సేన, రైళ్లు, బాంకింగు, కర్సెన్సీ మొదలయిన ప్రభుత్వాంగాలన్నీ జర్మనీతో మేళవింపు నొందాయి.

భాషా ప్రయుక్త దృష్టితో చూస్తే ఈరెండు రాజ్యాల ఐక్యతా కోరతగిందే. ఫ్రాంసు మొదలయిన రాజ్యాలదృష్టితో ఈవిషయం పరిశీలించడం మనపనికాదు. జర్మన్‌భాష మాట్లాడే ప్రజంతా ఒక బావుటాక్రిందికి రావడం వరణీయమైందే.

హిట్లరు కొన్ని రాక్షసకృత్యాలు చేస్తున్నాడనే కారణంచేత జర్మన్‌ల ఐక్యతని మనం కంటగించుకోకూడదు. ఆచరణలో కలిగే అవకతవకల్ని బట్టి మూలసిద్ధాంతాన్ని తెగడ్డం పనికిరాదు.

ఏకభాష అనేది ప్రజల్ని బంధించే బలమైనతాడు. దానిని తెగకోయడానికి రాజకీయవేత్తలు సృష్టించే సరిహద్దులనే కత్తులు [illegible]

ఆస్ట్రియా జర్మనీల ఈ కలయిక ఫ్రాంసుకు అశనిపాతం. ఏమంటారా?

వర్సైయిల్సుసంధి జర్మనీకి చాల అన్యాయంచేసింది. ఆ అన్యాయం తొలగించుకోవడానికి జర్మనీ ఏనాటికేనా యుద్ధం చేసి తీరుతుంది. యుద్ధంచేయడానికి ముందు స్నేహితుల్ని సంపాదించుకోవలసి వుంటుంది. తనకు మళ్ళనే ఫాసిస్టు ప్రభుత్వంలోవున్న ఇటలీ తనకు స్నేహంచేయతగ్గది. ఇటలీకి ఫ్రాంసుమీద కసివుంది. ఈసంగతి ఫ్రాంసుకు తెలుసు. అందుచేత ఇటలీ జర్మనీలు స్నేహితులు కాకుండా వుండడం ఫ్రాంసుకోరిక. అందుకనే రెండు రాజ్యాలకి నడుమను స్వతంత్రమైనదైనప్పటికీ తనచెప్పుచేతల్లోవుండే ఆస్ట్రియాను ఫ్రాంసు నిలుపుకుంటూ వచ్చింది.

ఆస్ట్రియా ఇపుడు జర్మనీ, ఇటలీలకు నడుమను వుండి తన పలుకుబడిగల లీగు యాజమాన్యం క్రింద వుంది. ఇల్లా వుండకుండా ఆస్ట్రియా జర్మనీలో కలిసిపోతే ఇటలీకి జర్మనీకి సరిహద్దులు ఒకటే అయి ఆరెండు దేశాలికీ స్నేహం హెచ్చడానికి, యుద్ధసమయంలో కలిసి పనిచెయ్యడానికి అవకాశం ఏర్పడుతుంది అని ఫ్రాంసు ఇన్నాళ్ళనుంచీ భయపడుతూ వచ్చింది. భయపడ్డంతా అయితీరింది.

జర్మనీకి అవతల తూర్పు యూరప్పులోను మధ్య యూరప్‌లోను వుండే దేశాలు పెక్కింటితో ఫ్రాంసు స్నేహం సాగిస్తూ వుంది. ఆస్ట్రియా జర్మనీతో కలిసిపోయిననాడు అటు బాల్టిక్‌నుండి ఇటు మెడిటరేనియన్‌వరకు ఉండే దేశమంతా ఫాసిస్టుబ్లాక్ అయి అవతల దేశాలకు రాకపోకలకు వీలులేకుండా పోతుంది. ఫ్రాంసు బ్రిటన్‌లు ఒకప్రక్క, రష్యా, లిటిల్ ఎన్‌టెటీ దేశాలు ఒకప్రక్క వుండిపోయి యూరప్ రెండు చెక్కలుగా అయిపోతుంది. అందుకని ఆస్ట్రియా ఇటలీతో కాని జర్మనీతో కాని చేరకుండా వుండాలని ఫ్రాంసు పట్టుదల వహించింది. కాని యూరప్ రెండుచెక్కలుగా అవడం, మధ్యను ఫాసిస్టుబ్లాక్ ఏర్పడడం జరగనే జరిగింది.

ఆస్ట్రియాజర్మనీల కలయికను ఏవిధంగానూ నిరోధించలేక కడుపుమండి జెకోస్లొవాకియాలోని జర్మన్‌లను జర్మనీలో కలుపుకోడానికి హిట్లరు ప్రయత్నిస్తే తాను వూరుకునేదిలేదని ఫ్రాంసు అంటూంది.

జెకోస్లొవాకియాలోవున్న 35 లక్షల జర్మనులలోనూ అప్పుడే జర్మన్ యుద్యమం ప్రబలంకావడమూ, ప్రభుత్వంవారు సన్నసన్నగా ఆనాటి జర్మనుల కోరికలు తృప్తిపరచడానికి సిద్ధపడుతూండడమూ జరుగుతూ వున్నది.

ఏకభాషఅనే అనుబంధంచేత ప్రేరితమైన జాతీయోద్యమవిజయాన్ని అడ్డుపెట్టడానికి సర్వం కదిలించే కాలమూర్తికి కూడా ఎల్లప్పుడూ సాధ్యంకాదు.

# అసలే పువ్వుబోడులైతే వేరే పువ్వులెందుకు ?

# పువ్వుల్ని బహిష్కరించాలి-

యంటారా ?

సహజసౌందర్యంవున్న స్త్రీరత్నాలికి పువ్వులతో అవసరంలేదు.
పుట్టుకురూపులైన స్త్రీలకు పువ్వులు మెఱుగులు దిద్దలేవు.

కాని

పువ్వసౌరభం ఆడది మగవానిమీద ప్రయోగించే విషవాయువు.

కాబట్టే ఆమె

పువ్వుకోసం మగవాడిని ఎడంకాలితో తన్నడానికైనా సందేహించదు,
పువ్వుకోసం మగవాడిచేత దొంగతనం చేయించడానికైనా వెనుతియ్యదు.

ఇంతకీ—తేవక తేవక

మగవాడు పువ్వులు తెచ్చేడా అంటే ఆరాత్రి విశేషం వుందన్నమాటే.

---

పువ్వు అంటేనే పులకరిస్తుంది కొంత మందికి. పువ్వును చూస్తే వెర్రికొందరికి. పువ్వును పుణికితే కొందరి కానందం. మూఢభక్తులు పువ్వుల్ని దేవుని పేరు చెప్పి తెగవాసన చూస్తారు. జన్మచేతనే కుసుమకోమలులైన స్త్రీలు కూడా అందానికి అంటూ కొప్పుల్లో కుసుమాలు పెట్టుకుంటారు గదా! సిగలలో చంద్రవంకలా మల్లిపూలు తురుముకున్న మానినీమణిని చూచి చిత్తకార్తి కుక్కలా చిందులుత్రొక్కే చిల్లరిజనులసంఖ్య చిల్లరిగావుండక టోకుగానే వుంటుంది.

ఇన్ని రకాలుగా మానవ తత్వాన్ని మార్చిన పుష్పాలలో గర్భితమైవున్న శక్తి మహనీయమైంది కాకుండా వుంటుందా?

ఇల్లాంటి భావాలతో ఆసాయంకాలం మామూలుగా త్రిప్లికేన్ బీచికి బయలుదేరా. ఎందుకీభావం కలిగిందంటారేమో ? బయటికి పోదాం అని బడాయిస్తోంటేనే ఏమండో! పూలు మరిచిపోకండే అంటూ రాణిగారి ఆజ్ఞ. సుగ్రీవాజ్ఞ దాటితే బుర్రే పోతుందిగాని, మారాణీగారి ఆజ్ఞ దాటితే, పున్నామనరకప్రాప్తి అవుతుందని నా భయం. పువ్వులు తేందే ఆవిడ నన్ను దగ్గరకు చేరనివ్వదు. దగ్గరచేరందే పిల్లలు ఎల్లా పుడతారు? పిల్లలు పుట్టందే పున్నామనరకం ఎల్లా తప్పుతుంది ?

ఏగాని ఏడురూపాయలంత విలవగా వున్న యీకరవురోజులలో-శవాలమీద వేసిన పువ్వుల్ని తెచ్చి మంచిపువ్వులలో కలియపోసి అమ్మే మదరాసు పువ్వులికి పోసే డబ్బు చూస్తే నాకు పిసాళం వేస్తుంది. కాని రాణీలకు లొంగే రాజులు వాటిని తేకండా ఏంచేయగలరు, మీరే చెప్పండి.

అదేమి కర్మమోగాని మాలతి, మందార, మల్లీ, చామంతి, జాజి, గులాబీ, నందివర్ధనం, నాగమల్లి, బొడ్డుమల్లి, పారుజాతం మొదలైన మేలుజాతిపూల మొక్కలను పెంచడం మానేసి పాపిష్టి క్రోటన్సు, సర్వీ, సీమచింత మొక్కల్ని నాటి తమదొడ్లలో అతిశ్రద్ధగా పెంచే నేటి ఆంధ్రనవనాగరికులు కూడా మదరాసు వస్తే—అద్ది మొగుడిలా అల్లల్లాడే రేకులతోవుండే గులాబిపండల్ను, కంపుగాని యింపుగాని లేని అడవి చామంతిపూల చెండ్లు, పచ్చగడ్డిలాంటి దవనం, చిలకతోటకూరలాంటి మరువం తట్టలాదిగా తరలించుకు పోతారు. అరవప్రాధాన్యంగల మద్రాసు అంగళ్ళలో ఇల్లా పుష్పాలు కొనుక్కుపోయే ఆంధ్రత్వం లేని ఆంధ్రమహాశయులను అసలైన ఆంధ్రు లందరు నిరసిస్తారని తలుస్తాను.

ఈగొడవకేంలెండి, పువ్వులు తేకండా యింటికి తిరిగివస్తే అలనాడు కృష్ణుడికి పట్టిన అవస్థే నాకున్నూ సంభవిస్తుందేమో నని సందేహంతోచగా నిరుత్సాహంతో గుమ్మంలోనే కూలబడ్డా. అప్పుడు పువ్వులు, వానిని మనపువ్వుబోడులు తలలో పెట్టుకొనే ఆచారం, తలపువ్వు అంటే శ్రేష్ఠవాచకం కావడం, తలపువ్వు వాడకుండావుండడం స్త్రీలసౌఖ్యానికి ఒక గుర్తుగా భావింపబడడం మొదలైన భావాలు పరంపరగా నామనోవీధిని పరుగెత్తేయి.

పోనీ ఏదో మగవాళ్లు పువ్వులు తెచ్చారుకదా అని మన ఆడవాళ్లు వాటిని వాసనన్నా చూస్తారా, ఏమన్నా నా. యిచ్చియ్యడంతోటే కొప్పులో కుక్కుకుంటారు. వాసన చూచే శక్తిగల ముక్కుదగ్గరికి వాటిని పోనియ్యకుండా నల్లటి జుట్టుముడిలోకి వాటిని పోనియ్యడం పాలాలమీద కురియకుండా వాన పోయి అడవిలో కురియడంలాగే వుంటుంది.

మగాడితో మాకున్నూ సమానమైన హక్కులు కావాలని స్త్రీలు గొంతుకలు

చించుకొనే ఈరోజులలో కూడా మనుపటిలాగే అంతకన్నా బాహాటంగాను- మగాడు ఎప్పుడేనా ముక్కు దగ్గర పెట్టుకునే పువ్వుల్ని ఆడాళ్లు అస్తమానూ కొప్పులో పెట్టుకోవటం మగవానితో సమానమైన హక్కులుపొందే సరంజామేనా?

పువ్వులుకోసం ఏపుండాకోరు పువ్వుబోడి అయినా పురుషుణ్ని కొట్టిందాఅని అడుగుతారేమో పాత పురాణలలో అల్లాంటివారు పుట్టేదున్నారు. మగాళ్లు మొద్దులు, ఆడాళ్లు అబలలు అని ఏచవటలో ప్రాసారని పిస్తుంది ఆఘట్టాలు చదివితే. ఇప్పుడు ప్రజల్ని బానిసలుగా చేసుకునేందుకు బాంబులు, విషవాయువులు ఉపయోగిస్తున్నారు. కాని ఆకాలంలో, యీకాలంలో ఆడవాళ్లు మగాళ్లని బానిసలుగా చేసుకోడానికి పుష్పబాణాలే వుపయోగించారు, ఉపయోగిస్తున్నారు. బర్మాసిగచుట్టూ బ్రహ్మాండంగా చంద్రవంకలా మల్లిమొగ్గలు కట్టుకుంటే ఆఆడదాన్ని చూచిన మగాడల్లా గుమ్మయిపోయి గులాం అయిపోయినట్టే—ఒకరిద్దరు నపుంసకలింగాలలోచేరే బ్రహ్మచారి ముండావాళ్లు తప్ప—చూట్టానికి మన్నితంగా వుండేపువ్వు వజ్రాయుధంలాగ ఉపయోగపడటం వింతగానేవుంది.

ఇలాంటి సమ్మోహనాస్త్రం తనకియ్యకుండా రుక్మిణమ్మకిచ్చాడని సత్య కృష్ణుని మక్కవిరగతన్నింది. ఆమె పువ్వుబోడి కాబట్టిన్నీ, అతడు పుష్పబాణుడి బాబు కాబట్టిన్నీ, పువ్వుకోసమైన యుద్ధసంబంధమైంది కాబట్టిన్నీ తన్నినతాపుకి ఏమీ అనుకోక పైగా కృష్ణుడు కాలు కందిందా భామా అంటూ సత్యభామకాళ్లుపట్టుకున్నాడు. —స్మరుడు, వాత్స్యాయనుడు, కూచిమారుడు మొదలైన కామశాస్త్రవేత్తలు, శృంగారరసికులు దీన్ని 'పాదతాడనం' అనొచ్చు. కాని ఈసందర్భంలో నావంటిఆమాయకునికి పువ్వులు పురికొల్పే పురుషత్వాన్ని ప్రోత్సహించ[illegible]వ్వులులేని పడతి ఏంచేస్తుందని ప్రశ్న ఉదయిస్తుంది.

ఆడాళ్ళకి కుసుమకోమలులని సార్థకనామం కాబట్టి కుసుమాలను వాళ్లు కోమలంగా కాకుండా విరివిగా పెట్టుకోవచ్చునంటారు స్త్రీల ఆరోగ్యసౌభాగ్యాలను అభివృద్ధిచెయ్యడమే తమ ప్రధానోద్దేశమనే నాయకమహాశయులు.

ద్రౌపది కేం చెప్పండి? ఐదుగురు మొగుళ్లు. తీరికేవుండదాయె... తలదువ్వుకోటానికన్నా పనితో. అలాంటి సాధ్వికి వనంలో గాలిపాటు వల్ల వచ్చిన ఒక్క సౌగంధికపుష్పం దొరికితే వూరుకోక ఆశ అపరిమితంఅయి మరికొన్ని తెచ్చేదాకా వేపుకుతింది, భీముని. దానికోసం చావుదెబ్బలు తిని, కముకుదెబ్బలు కొట్టి ఎట్టాగో అట్టా పట్టుకొచ్చాడు, ఆసన్యాసి — వనాలలో తిరిగేవారు సన్యాసులేగా — ధనికుడైన కుబేరుని వనంలోని పువ్వుకోసం యింత మోజు ద్రౌపదికి ఎందుకో?

ప్రబంధనాయకు లందరూ పువ్వుబోడులు దొరికేదాకా పువ్వులనే పట్టుకుని ఏడ్చారు. ఇంట్లోకూచుంటే ఇంతి జ్ఞాపకంవచ్చి ఉద్యానాలలోకిపోయి ఉన్మాదం తీర్చుకుందాం అనుకుని అక్కడ పూవుల్ని, రెమ్మల్ని, కొమ్మల్ని, కోకిలల్ని పట్టుకు పడతిట్టేవారు.

ఇవన్నీచూస్తే పువ్వులికి మానవజీవితంలో తీసిపారేయరాని స్థానం వుందనిపిస్తుంది. చూడండి పెళ్ళిలో పూలు, గర్భాధానంలో గదినిండా పువ్వుబోడులతోపాటు పువ్వులు, సాగితే పూలపాన్పు, కడుపుతోవుంటే పూలు,. పుత్రుడు పుడితే పూలవర్షం, గద్దెఎక్కితే పూలు, ఉపన్యాసాలిచ్చే విరాగులకు పూలదండలు. చెన్నపట్టంలో చచ్చినా పూలరథం.

[illegible] ఇన్ని విధాల మనుష్యుల్ని అంటిపెట్టుకున్నవాటిని వదలమంటే వదలేవారెవరు?— బిరుదులు వద్దనే కాంగ్రెసుమంత్రులుకూడా పువ్వులదండ వద్దనరే—.

పోనీ యిళ్ళలో ఏలా ఏడ్చినా బయటన్నా మానేస్తే బాగుండును. అంతఃపురాలలో అల్లకల్లోలంచేసే కుసుమరాజా[illegible] వారవనితలకొప్పుమీద కురికాయి. ఆ[illegible]ళ్ళ రాజ్యాలు ఏలా లనుకుంటుంటే [illegible]మేం మాత్రం బూబుల్లా యింట్లో ఎందుకుండాలని పువ్వులున్నా పువ్వుబోడులతో బాటు నడి బజారులోకి వస్తున్నాయి.

పెళ్ళికి భోగంమేళం వచ్చిందంటే [illegible]క్కడలేనిజనం ఊరేగింపుకి వస్తారు. కులాసాపుత్రాళ్ళందరూ పువ్వులుఏది బాగా పెట్టుకుంటే దాని పెళ్లిచేస్తారు ఆకో[illegible] మొనగాళ్ళందరూ ముందుకొచ్చి ఒక్కసారన్నా మూచూచి పోతారు. యిం[illegible] ఎందులో వుందంటే కొప్పులో కిలకిల్లా[illegible] కుసుమాలలో నని చెప్పాలి.

ఇక రాజకీయసభలకి, చట్టసభల[illegible] పువ్వుపెట్టుకున్న పువ్వుబోండ్లు వస్తే చట్టవిమర్శన మాని పక్కచూపులు చూస్తారు ప్రముఖులందరూ. మన మద్రాసు శాసనసభలో ఇల్లాంటి ఘట్టాలు ఎన్నో సారులు సంఘటిస్తున్నాయి.

అయితే దీనికి ఆడవాళ్లు మేమే కా[illegible]కుండా సభాధ్యక్షులు కూడా వేసుకుంటున్నారే దండ లంటారు—అసలు వారిని చూచే వీరనారీమణులు కూడా వెంబడివస్తున్నారు. అవసరమైతే ఈ విషయంలో స్పీకర్ సాంబమూర్తిగారి[illegible] రూలింగు అడగండి.

అన్నివిధాలా అంటే చదువులోను, కట్టేకట్టులోను, తినే తిండిలోను ఆంగ్ల సాంప్రదాయంలో నడిచే యువతులు యీవిషయంలో కూడా అంతే పువ్వులు పెట్టుకోవటంలో కూడా ముందంజవేసి

రచయిత:

కె. రామమూర్తి, యల్. యమ్. [illegible]

పూలబజారులు ముందు మూయించడానికి ఒకచట్టం శాసనసభలో పెట్టేటట్టు అలజడిచేస్తే నావంటిబీదవాళ్లు బతికిపోతారు.

ఆంగ్లేయస్త్రీపురుషులు కలిసిమెలిసి రాసుకు తిరిగినా పులకరించే పూలు పెట్టుకోరు కాబట్టి భాషించేటంత సేపూ భావవికారం కలుగదు. మనది అసలే వేడిదేశం. అందులో వాడియైన పూలతో కూడిన పువ్వుబోండ్లను చూస్తే పురుషుడు చిమ్నీదగ్గర వెన్నలాగ కరగకుండానూ, అగ్గిమీది గుగ్గిలంలాగ ఒకసారి ఉఫ్న భగ్గవకుండాను ఎట్లా ఉంటాడు చెప్పండి?

ఈలా అడిగినందుకు కోపగించకండి.

ఇలాంటి అవకాశాలు కలగకుండా చిత్రసభలకివచ్చే తల్లులు, మగపిల్లల బడిలో చదువుకునే ఆడమ్మాయిలు, టాకీల్లో నటించే నటీమణులు, సినీమాలు చూడ్డానికి వచ్చే సుందరాంగులు, తీర్థాలంట తిరిగే తరుణులు, ఉద్యోగాలుచేసే యువతులు-ఒకరేమిటి అందరూ పూవులను విసర్జించారంటే యువతీయువకులు విచ్చలవిడిగా ఎట్టి వికారాలు లేకుండా విహరించవచ్చు. కామవికారం అంతా పువ్వుల్లోనేవుంది.

పువ్వుల ఉపయోగం ఇట్లా మనకి బాధకలిగించడమే కాదు అది వాటికిన్నీ బాధే. పువ్వులకిన్నీ ప్రాణం అంటో వుంది. వాటిని కోసి వాటిప్రాణాలు తీయకూడదని యితరదేశాలలో యింతింతగాదు బ్రహ్మాండమైన అలజడి జరుగుతోంది. అహింస పరమధర్మమని అలనాడు * బుద్ధభగవానుడున్నూ ఈనాడు గాంధీభగవానుడున్నూ దిక్కులు పిక్కటిల్లేటట్లు చెప్పిన, చెబుతూవున్న మనదేశంలో ఈఉద్యమం జయప్రదం అవుతుందని నానమ్మకం. పువ్వులు విలాసవస్తువులే కాని ప్రాణాధారమైనవి కావు. ప్రాణం నిలుపుకోడానికి చాలా హింసలు చేస్తూనే వున్నాం. ప్రాణాధారం కాని పువ్వుల విషయంలో మనం ఎందుకు హింస సాగించాలి?

ఇంతకూ నేచెప్పేదేమంటే పువ్వులు కృత్రిమాలంకారాలని. ఆఖరున చెప్పావని తీసిపారేయకండి. భోజనంలో మజ్జిగ అన్నం ఎంత ప్రాముఖ్యంవహిస్తుందో నా ఈవ్యాసంలో ఈవిషయం అంత ప్రాముఖ్యంవహిస్తుంది. సహజసౌందర్యం లేకపోతేనే పువ్వుల్లాంటి కృత్రిమాలంకారాలు పెట్టుకోవలసివస్తుంది అనే విషయం మనం గమనించాలి. కాని మొఖం రబ్బరోలుపాత్రంలావుంటే పువ్వులెట్టుకుంటే మాత్రం ఏంలాభం? సహజసుందరులైతే పుష్పాలక్కరనే లేదు. పువ్వుబోడులు పువ్వులు పెట్టుకోడం అందంలో తమకున్న లోటును కప్పిపుచ్చటానికే అనడంలో సందేహంలేదు. చెమటకంపువాడు సెంటురాసుకున్నట్టు- తెల్లమీసాలవాడు రంగేసుకున్నట్టు- అనాకారులు పెట్టుకునే పువ్వులు అందరూ పెట్టుకుంటే అందరూ అనాకారులనే భావం ప్రజాలోకంలో కలక్కమానదు.

కాబట్టి పలువిధాలైన వికారాలు కలిగిస్తూ ఈవిడకి సహజసౌందర్యం లేదు కాబోలు పువ్వులుపెట్టుకుంది అనే అనుమానానికి అవకాశం ఇచ్చే పువ్వులు ధరించడం మానేసి మనస్త్రీలు తమ సహజసౌందర్యంతోటే మనఎదట మెలుగుతూవుంటే బాగావుంటుందని నా అభిప్రాయం.

ఇట్లా ఈభావపరంపర నామనోవీధిని పరుగులెత్తుతూవుండగా మా ఆవిడ ఎందుకో వీధిగుమ్మంలోకి వచ్చి నన్ను చూసి ఇంకా ఇక్కడేవున్నారా, షికారు పోలేదూ, లోపలికివచ్చి కాస్త వక్కపొడి వేసుకు మరీవెళ్ళండి అంటూ అంది.

౪౦౦ పుట తరవాయి]

యన్ రాజు పరిపాలన కంటగింపుగా వుండేది. ఆస్ట్రియానుండి విడిపోవడానికి కూడా హంగరీప్రజలు ప్రయత్నించేవారు. ఫ్రాన్సిస్ జోసెఫ్ ఆస్ట్రియా చక్రవర్తి అయిఉండగా ఈ ప్రయత్నాలు తీవ్రరూపం తాల్చాయి. 1916 లో చనిపోయే లోపుగా అతను అరవై ఎనిమిది సంవత్సరాలు ఆస్ట్రియన్ సామ్రాజ్యాన్ని పరిపాలించేడు. కాని అతని కాలంలోనే హంగరీకి ప్రత్యేకం పార్లమెంటు ఈయబడింది. నామకః జోసెఫ్ హంగరీకి కూడా రాజే. స్థానికవిషయాల్లో స్వాతంత్ర్యం వున్నా సైనికనిర్మాణంలోనూ, విదేశాంగవ్యవహారాలలోనూ ఆస్ట్రియా హంగరీలు ఒకటిగానే వుండేవి.

1914 లో ఆస్ట్రియన్ సామ్రాజ్యం మహోన్నతస్థితిలో వుండెను. ధనవంతమై, బలీయమై, ఏ రాజ్యానికి భయపడకుండా, ఇరుగు పొరుగు రాజ్యాల గౌరవాన్ని అందుతూ, యూరపియన్ రాజధానీ నగరాలలో అపూర్వమైనదిగా పేరుపడ్డ వియన్నాపట్టణం రాజధానీనగరంగా, విశేషించి బలీయమైన జర్మన్‌సామ్రాజ్యపు స్నేహాన్ని సంపాదించుకుని నాటి ఆస్ట్రియా సామ్రాజ్యం దుర్నిరీక్ష్యమై ఉండెను. సామ్రాజ్యాంతర్భాగములయిన హంగరీ పచ్చికబయళ్ళకు, పంటపొలములకు, కలపకు—కార్పాథియన్సు ద్రాక్షతోటలకు—రష్యాసరిహద్దు ప్రాంతములు ఎల్లగిసె చెట్లకు, జనపపంటకు—తూర్పు ఆస్ట్రియా ఇనుపగనులకు—బొహీమియా మంచి రాతిసిబొగ్గుకు—గాలేషియా, స్టిరియా, సాల్జు బర్గులు ఖనిజసంపదకు—బొహీమియా, హంగరీలు వెండి బంగారుగనులకు ప్రసిద్ధికెక్కి ఉండెను.

వీటి అన్నిటికంటె ముఖ్యమైంది మధ్యయూరప్‌లోని బాటలకు అన్నిటికీ ఆస్ట్రియా అందుబాటులో వుండడం. డాన్యూబ్ నది, మంచిరోడ్లు, రైలుబాటలు ఆస్ట్రియామీదుగా బాల్కన్ రాష్ట్రాలికి ప్రాచ్యదేశాలికి సామాను తీసుకుపోయేవి. ఇటలీతోను, మెడిటరేనియన్ రాజ్యాలతోనూ జర్మనీకిని, ఇతర బాల్టిక్ రాజ్యాలికిన్ని ఉన్న వ్యాపారమంతా ఆస్ట్రియాగుండానే నడిచేది. ఆస్ట్రియన్ సామ్రాజ్యానికి చెందిన వియన్నా, ప్రేగ్, బుడాపెస్టు, ఇంకా అనేకమైన ఇతర చిన్నపట్టణాలు జనాకీర్ణములై ధనవంతములై దినదినాభివృద్ధి నందుతూవుండేవి.

ఈసుగుణాల కన్నిటికీ వేరుపురుగులా ఒకలోపంమాత్రం ఈ సామ్రాజ్యాన్ని పట్టిపీడించేది. ఆస్ట్రియన్‌చక్రవర్తి మాతృభాష జర్మన్. అతని సామ్రాజ్యంలో పదకొండుకు పైబడిన వివిధభాషలను మాట్లాడే వివిధ ప్రజలు వుండేవారు. ఏభాషను మాట్లాడే ప్రజలు ఆభాషారాష్ట్రాన్నే ఆస్ట్రియా హంగరీ సామ్రాజ్యాన్నికంటె ఎక్కువగా ప్రేమించేవారు. వారి వారికి వేరే చరిత్ర, వేరే ఆచార వ్యవహారాలు వుండేవి.

సామ్రాజ్యంలోని నాలుగో వంతు జనులు—అసలు ఆస్ట్రియాలో వుండేవారు—మాత్రం జర్మన్‌లు. హంగరీలోని మాగ్యార్లు మరోనాలుగోవంతుకు సరిపోయేవారు. నాలుగింట రెండు వంతులు ఇట్లు జర్మన్‌లు, మాగ్యార్లు అయిపోతే ఇక మగిలిన రెండువంతులూ ఇతరజాతులయి వుండేవారు. టైరోల్‌లోని దక్షిణభాగంలోనూ, ఎడ్రియాటిక్ తీరాన్ని వున్న డాల్మేషియన్ భూభాగంలోనూ ఇటాలియన్‌లు వుండేవారు. బొహీమియాకు ప్రాక్తనరాజ్యంగా ప్రత్యేకచరిత్ర వుంది. హంగరీలోని ఉత్తరదక్షిణభాగాల్లో జెక్కు, సెర్బ్సు, క్రోట్సు, బోస్నియన్సు, స్లావినీస్, పోల్సు, రుమేనియన్సు వుండేవారు.

వీరి అందరికీ జర్మన్‌భాషను మాట్లాడే ఫ్రాన్సిస్ జోసెఫ్ చక్రవర్తి. ఒక్కొక్కభాషను మాట్లాడే ప్రజాసమూహం ఒక్కొక్క అగ్నిపర్వతంలాగు వుండేది. ఆఅగ్ని పర్వతాలు అప్పటికి ప్రజ్వరిల్లుతూ వుండకపోవచ్చు. కాని ఏనిమిషాన్ని అయినా ప్రజ్వరిల్లి ప్రమాదం కలిగించడానికి అవకాశంవుండేది.

1914 లో ఆస్ట్రియన్ సామ్రాజ్యంలో దక్షిణాన్నివున్న అగ్నిపర్వతం ప్రజ్వరిల్లింది. బాల్కన్

రాష్ట్రాలలోనిదైన బోస్నియాను అంతకు కొద్దికాలం క్రితమే సామ్రాజ్యంలో కలుపుకున్నారు. జోసెఫ్ కుమారుడున్నూ, అతని తరవాత రాజ్యానికి రాతగ్గవాడున్నూ అయిన ఆర్చిడ్యూక్ ఫెర్డినాండు ఫ్రాన్సిస్ భార్యతోకూడా బోస్నియాలోని సెరాజివో దగ్గర గుండుదెబ్బకు గురిచేయబడ్డాడు.

బోస్నియాకు సెర్బియా పొరుగు రాజ్యం. సెర్బియా స్వతంత్రరాజ్యం. అందులోని ప్రజలంతా స్లావ్ జాతికి చెందినవారు. బోస్నియాప్రజలున్నూ స్లావ్ జాతికి చెందినవారే. సిరాజివో పట్టణపువీధులలో ఫ్రాన్సిస్ ఫెర్డినాండును భార్యతోకూడా గుండుదెబ్బకు గుఱిచేసినది ఒక సెర్బియన్ విద్యార్థి. సెర్బియన్ గవర్నమెంటుకు ఈహత్యతో ఏమీ సంబంధంలేనిమాట నిజమే కాని బోస్నియాలోని తన జాతీయుల్లో ఆస్ట్రియామీద ద్వేషాన్ని పురికొల్పే ప్రచారంమాత్రం అది సాగిస్తూవుండేది. ఇందుమూలంగా ఆస్ట్రియాకు సెర్బియామీద గుర్రుగా వుండేది. దాంతో ఈహత్య కారణంగా తీసుకుని ఆస్ట్రియా సెర్బియారాజధాని అయిన బెల్‌గ్రేడ్‌కు అల్టిమేటమ్ పంపింది. ఇకమీదట బోస్నియాలో ఆస్ట్రియాకు ప్రతికూలమైన ప్రచారం చేయము అని పూచీకత్తు ఇవ్వాలనీ, ఇదివరకు ప్రతికూల ప్రచారం చేసి వున్నారని తనకు అనుమానం వున్న సెర్బియన్ ఉద్యోగస్థులను అందర్నీ పనుల్లోనుండి తొలగించాలనీ. ఆ అల్టిమేటమ్ కోరింది.

తన ప్రభుత్వవిధానంలో విదేశ ప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం సెర్బియాకు ఇష్టంలేక పోయింది. కాగా ఆస్ట్రియాషరతులకు అది అంగీకరించలేదు. అందుమీద జూలై 28-వ తేదీని ఆస్ట్రియా హంగరీ సెర్బియామీద యుద్ధం ప్రకటించింది. సెర్బియాకు సహాయార్థం రష్యాయున్నూ, ఆస్ట్రియాకు సహాయార్థం జర్మనీయున్నూ యుద్ధసన్నద్ధమైనాయి. ఆగస్టు 2-వ తేదీని జర్మనీ రష్యాలకు యుద్ధం ప్రారంభమైంది. మరునాడు జర్మనీ రష్యామిత్రమైన ఫ్రాన్సుదేశంమీద కూడా దండెత్తింది. 4-వ తేదీని బెల్జియమ్, ఇంగ్లండు కూడా యుద్ధభూమిలో ప్రవేశించాయి. ఐరోపా మహాసంగ్రామం ప్రారంభమైంది.

యుద్ధం ముగిసింది. ఆస్ట్రియన్ సామ్రాజ్యం కరిగిపోయింది. హంగరీ తిరిగి స్వతంత్రరాజ్యంఅయింది. జెక్సు, స్లావాక్సు కలిసి జెకోస్లొవాకియారిపబ్లిక్‌ను స్థాపించుకున్నారు. బొహీమియాకూడా ఇందులోనే చేర్చబడింది. సెర్బులు, క్రోట్సు, స్లావెనీస్ యుగోస్లావియా రాజ్యంగా ఏర్పడ్డారు. పూర్వోత్తరపు దిక్కున ఉన్న భూభాగాలు పోలెండుకు ఈయబడ్డాయి. ఆగ్నేయమూలలోవున్న భూభాగాలు రుమేనియాకుచేర్చబడ్డాయి. ఇదివరకు ఆస్ట్రియాకు చెందిన ఎడ్రియాటిక్ సముద్రతీరప్రదేశాలున్నూ, దక్షిణ టైరోలున్నూ ఇటలీ తీసుకుంది.

ఏడువందలమైళ్ళ పర్యంతమూ ఒక్క ఆస్ట్రియన్ సామ్రాజ్యంలో ప్రవహిస్తూవుండే డాన్యూబ్ మహానది నేడు ఆఏడువందలమైళ్ళే నాలుగు స్వతంత్రరాజ్యాలగుండా ప్రవహిస్తూవుంది.

కొమ్మలూ రెమ్మలూకొట్టేసిన చెట్టులాగ, రెక్కలూ ఈకలూ పీకేసిన పిట్టలాగ మిగిలిపోయిన ఆస్ట్రియా—జర్మన్ భాషను మాట్లాడే ఆస్ట్రియన్ సామ్రాజ్యభూభాగం, ఆరువందల సంవత్సరాలకుపూర్వం హాప్సుబర్గు వంశీకుల ప్రదేశలేశం——1918-వ సంవత్సరం నవంబరు 12-వ తేదీని రిపబ్లిక్‌గా ప్రకటించుకొన్నది.

యుద్ధం, యుద్ధంలో పరాజయం, పరాజయంతో దౌర్భాగ్యం దేశానికి తెచ్చిన ప్రభువంశం ఇక తమదేశంలో ప్రభుత నెఱపకూడదనుకొన్నారు ఆస్ట్రియన్ ప్రజలు. కాగా నాలుగుఏళ్ళకు ఓసారి తాము ఎన్నుకొనే అధ్యక్షుడే తమ పరిపాలకుడుగా వుండాలని వారు తీర్మానించుకున్నారు.

‘కంటిజోళ్లు వేసుకుని దృష్టిలోపం తెచ్చుకునేవాళ్ల సంఖ్య హెచ్చుగావుంది’

# జోడుకోరే కన్ను కన్ను కాదు

కళ్లజబ్బులు రావటానికి ముఖ్యకారణాలు ఐదు.

కళ్ళకు తరుచు మందులు వాడటం మంచిదికాదు.

దృష్టిదోషాలు నవరించుకోడానికి మందులతో పనిలేని మార్గాలున్నాయి.

రచయిత:

జంధ్యాల జానకిరామయ్య

ఈకాలంలో స్త్రీలూ, పురుషులూ చాలామంది కళ్లజోళ్లు వుపయోగిస్తూవుండటం తఅచుగా చూస్తున్నాం. వీళ్లంతా నిజంగా యేదో కళ్లజబ్బు వుండే కళ్లజోళ్లు వాడుతున్నారా? చత్వారం వుండే ముసలాళ్లను, అకాలంలో చత్వారంపట్టిన పడుచువాళ్ళను మినహాయిస్తే, ఎక్కువమంది కళ్ళజోళ్లు సరదాకోసం, తమాషాకోసం, డాబుకోసం, డంబంకోసం, ఫాషన్‌కోసం, సౌందర్యవృద్ధికోసం వాడేవాళ్లే అగుపిస్తున్నారు.

కౌడెప్రాయంలో వుండేవాళ్లు —దృష్టిలోపం లేకపోయినా— కళ్ళజోళ్లెట్టుకోవటం వో అంటువ్యాధిలాగా తయారైంది. అందుకనే, రకరకాల కళ్ళజోళ్లూ అందచందాలకళ్ళజోళ్లు తయారై నేడు కుఱ్ఱాళ్ళకు మరులు కొలుపుతూన్నయి.

ఇప్పుడు హైస్కూళ్లల్లో విద్యార్థుల్ని వైద్యపరీక్ష చేసే డాక్టరు దృష్టిలోపం వుండే కుఱ్ఱాళ్లందరూ కళ్ళజోళ్ళెట్టుకోవాలి అని వాళ్లవాళ్ల మెడికల్ రిజిష్టర్లలో రాస్తున్నారు. డాక్టరల్లా రాశాడంటే ఆ కుఱ్ఱాళ్లను కళ్లజోడులేందే హెడ్మాస్టరు క్లాసులో అడుగు పెట్టనియ్యడు. ఇదో గమ్మత్తు కనిపెట్టి, దృష్టిలోపంలేని కుఱ్ఱాళ్లుకూడా కొందరు కళ్లజోళ్లు వేసుకోటానికి తరుణం దొరికిందనే సర్దాతో డాక్టరు చదవమన్నది చదవకుండా కనిపించటం లేదని చెప్పి తమతమ మెడికల్ రిజిష్టర్లలో దృష్టిలోపం అని రాయించుకుంటూ యింట్లో గల్లంతుచేసి కళ్లజోళ్లు కొనిపించి సరదాగా ముస్తాబై స్కూలుకు హాజరవుతున్నారు. చదువుకునే కుఱ్ఱాళ్ళకు కళ్ళజోళ్ళమీద [illegible] మోజు విపరీతంగావుంది.

దృష్టిలోపం వుండి జోళ్లు వేసుకునేవాళ్ళకంటే, జోళ్లు వేసుకుని దృష్టిలోపం సంపాయించుకునే వాళ్ళసంఖ్యే జాస్తీగా వుంది.

కాని, అసలు కళ్ళజబ్బులు రావటానికి నిజంగా ముఖ్యకారణాలు కొన్నివున్నై. ఆధునికజీవనం, కొత్తరకం దీపాలు, ఎలిక్ట్రిక్ దీపాలు, సినీమాలు, ఆరోగ్యలోపం,—ఇవి ఆముఖ్యలోపాల్లో కొన్ని. వీటిని ఒక్కొక్కటిగా చర్చిద్దాం.

## ఆధునిక జీవనం

ఈకాలపు యువకుల యువతుల నడవడి చాలా ప్రకృతివిరుద్ధంగా వుంది. వాళ్ళచూపు యెప్పుడూ ఫాషన్‌వైపే పరిగెడుతూంటుంది. లేనిపోని దర్జా వెళ్లబోయటానికి అలవాటుపడుతూన్నారు ఈరోజుల్లో అందం అనేపేరుతో వ్యయం తగ్గించుకోటానికి చిన్నచిన్న అక్షరాలతోటి వార్తాపత్రికలు, పుస్తకాలు ముద్రిస్తున్నారు. ఈ చిన్న అక్షరాలు చదవటానికి కండ్లుచీకరించుకోవటం మూలాన అదే మామూలై క్రమేపి దృష్టిలోపం యేర్పడుతోంది. మనదేశంలో—చదువురాకపోయినా—కళ్ళజబ్బులు లేకుండావుండే పల్లెటూరివాళ్లు

వో వైపూ, విద్యావంతుల మనే పేరుతో——కళ్లు పాడుచేసుకుని——జోళ్లుతగిలించుకొని నాగరికులం అంటూ విఱ్ఱవీగేవాళ్ళు వో వైపూ వున్నారు.

### కొత్తరకం దీపాలు

తగినట్టే యీ కాలంలో దీపాలు కూడా రకరకాలవి బైలుదేరుతున్నై. చదువుతూండేవారు——ముఖ్యంగా విద్యార్థులు——రాత్రిళ్లు తలవేపు హరికేన్ లాంతర్లు పెట్టుకుని పండుకుని గంటలకొద్దీ చదువుతూంటారు. అక్షరాలు చిన్నవైనయ్యా, సరేసరి, పుస్తకం కళ్ళకానించి చదవటానికి కారంభం చేస్తారు. ఇలాగా కొంతకాలం జరిగేటప్పటికి కళ్లల్లో నరాలు విచ్చుకుంటై. ఎక్కువసేపు వొకేచోట చూపు నిలపటంచేత ఆనరాలు అలాగే విచ్చుకుని వుండి క్రమంగా హ్రస్వదృష్టి (Short Sight) కి కారణం అవుతై. ఇల్లాగే పుస్తకాలు కళ్లకు చాలాదూరంగా వుంచుకుని చదవటం కూడా ప్రమాదమే. అంచేత కళ్ళల్లో నరాలు ముడుచుకపోయి క్రమంగా దీర్ఘదృష్టి (Long-Sight) యేర్పడుతోంది. లాంతర్ల దగ్గర చదవటంచేత కళ్ళకు వేడిసోకి చూపు నిలకడలేకుండా పోతుంది. లాంతర్లలోంచి వో మాదిరి పొగగాలి (Gassic Smoke) కూడా బయలుదేరి మనం పీల్చుకునే గాలిలో కలిసి పేగుల్లో చేరుతూంది. దీనివల్ల చాలావ్యాధులు కలగటానికి వీల్లున్నై. కిరసనాయిలు దీపం పొగ శ్వాసతో చేరి ముక్కుల్లో ప్రవేశిస్తే క్రమేణా ముక్కిడిలేక పీనస అనేవ్యాధి కలుగుతోంది. దృష్టి చాంచల్యం కలుగుతోంది. యిరవై యో శతాబ్దంలో కూడా ఆముదందీపా లేమిటని నిరసిస్తారు కానీ యిప్పటికీ ఆముదందీపాలూ, నూనెదీపాలూ వాడుతూ కళ్ళజబ్బులేమీ లేకుండా ఆరోగ్యంగా వుండేవాళ్లు పల్లెటూళ్ళల్లో వుండనేవున్నారు. ఎతావతా చెప్పేదేమంటే చల్లనివెలుతురిచ్చే దీపాలు వాడుతూంటే కళ్ళజబ్బులు రావటానికి వీలేవుండదని.

### ఎలక్ట్రిక్ దీపాలు

ఈరోజుల్లో పెద్దపెద్ద బస్తీల్లో అంతటా ఎలిక్ట్రిక్ దీపాలు వుండనే వున్నై. సాధారణంగా——ఏకొందరో తప్ప రంగుబల్బులు వుపయోగించటం లేదు. రంగుబల్బులు వాడితే అంతప్రమాదం వుండదుగానీ, తెల్లవాటివల్ల దృష్టిచాంచల్యం కలుగుతోంది. ఆవెల్తురు అలవాటు పడ్డతర్వాత యితర దీపాల వెల్తురు చీకటితో సమానంగానే వుంటుంది. అంచేత విద్యుద్దీపాలుంచుకునేవారు వీలైనంతవరకూ రంగుబల్బులు వుపయోగించటం మేలు. బల్బులు తెల్లవేఅయినా, వాటికి రంగుగుడ్డలు చుట్టటం రెండోపక్షం. ఇలా చేసినందువల్ల కళ్ళజబ్బులు రావటానికి అట్టే వీలుండదు.

### సినీమాలు

బస్తీల్లో సర్వత్రా ఇప్పుడు సినీమాలున్నై. సాయంత్రం అయ్యేసరికల్లా సర్వులూ సినీమాలకు హాజరు కావటం పరిపాటైంది. ఎక్కువ కాన్కలు చెల్లించి తెరకు దూరంగా కూచొని చూడగలవాళే వుంటారా అందరూ! తెరదగ్గిర కూచొని చూట్టంవల్ల మిరుమిట్లుగొల్పి దృష్టిచాంచల్యం కలుగుతోంది. అంచేత సినీమాలకి సుతరామూ పోకూడదు. పోయినా తెరదగ్గిర కూచోగూడదు. సినిమాలు చూట్టం యెంత తగ్గిస్తే ఆమూలాన వొచ్చే కంటిజబ్బులు అంత తొలిగిపోతాయి.

### ఆరోగ్యలోపం

కళ్లు అందంగా, ఆరోగ్యంగా వుండాలంటే జీర్ణశక్తికూడా బాగా వుంచుకోవాలి. శరీరంలో రక్తప్రసారం చక్కగా వుండేట్టు చూడాలి. అంచేత జ్ఞానతంతువులున్నూ బలంకలిగి వుంటవి. ఎంత ప్రయత్నించినా, జన్మతోవొచ్చిన హ్రస్వదృష్టీ, దీర్ఘదృష్టీ, కళ్లరంగూ బొత్తిగా పోక పోవచ్చుగానీ, ఆరోగ్యవర్ధకమైన విషయాల్ని జాగ్రత్తగా వాడుకలో పెడ్తే కళ్లశక్తి వృద్ధి కావడమే గాక కళ్లలోపాలున్నూ చక్కబడతవి. ఆరోగ్యం చక్కగా వుండాలంటే జీర్ణశక్తి చక్కగావుండాలి. జీర్ణశక్తి చెడటానికి వొక్కొక్క శరీరతత్వానికి కొన్నికొన్ని పరిస్థితులుంటై. కానీ సర్వసాధారణంగా——రాత్రిళ్లు ఎక్కువసేపు నిద్రమేలుకని వుండటంచేత జీర్ణశక్తి తగ్గిపోవటం, అందుమూలాన మలబద్ధవ్యాధి (Constipation) కలగ

టం, దృష్టిబలం తగ్గిపోవటం యేర్పడుతోంది. కాబట్టి, జీర్ణశక్తి కాపాడాలంటే రాత్రిళ్లు ఎక్కువసేపు మేలుకోకూడదు.

కళ్లకేమాత్రం జబ్బుచేసినా డాక్టర్ల దగ్గిరికి పరిగెత్తటం యీ కాలంలో ప్రజలకి అలవాటైపోయింది. డాక్టర్ల మందులూ, లోషన్లూ, అపరేషన్లూ యిలాంటివాటివల్ల లక్షలకొద్దీ మనుష్యులు కళ్లు పాడుచేసుకొని అల్లాడుతూ కళ్లజోళ్లకి దాసోహం అంటున్నారు. ఘాటైన మందుల్ని మృదువైన కళ్లెల్లా సహిస్తాయ్? మందులవల్ల తాత్కాలికంగా వుపశాంతి కలగవచ్చుకానీ, వాటివల్ల కలిగే చెడుగులు మాత్రం తెలుచుకోరానివి. కళ్లకు తరుచు మందులు వాడటం మనల్ని మనం నరకంలో తోసుకోవటమే.

డాక్టర్లకేం? మాటకుముందు ఆపరేషన్ చేస్తామంటారు! వెంబడితే, కళ్లజోళ్లు సేవించమంటారు. ఒకప్పుడు వో పెద్దధనవంతుడు భారతదేశంనుంచి కళ్లచికిత్స చేయించుకోటానికి ఆస్ట్రియాదేశం వెడితే అక్కడో పేరుపడ్డ డాక్టరు ఆపరేషన్ చేసి కళ్లజోళ్లు తగిలించి మూడేళ్లకోసారి తనదగ్గిరికి వచ్చి ఆపరేషను చేయించుకుంటూ, కళ్లజోళ్ళు మార్పించుకుంటూ వుండమన్నాట్ట. ధనవంతుడైన ఆ పెద్దమనిషే అందుతో హడలెత్తిపొయ్యాడు.

అయితే మరి ఇక స్వల్పగాళ్ళ గతి యేమిటి? వాళ్ళు అలా పాడైపోవలిసిందేనా?

కాదు, కొన్ని వుపాయాలున్నై. అసలు కళ్ళజబ్బు చెయ్యకుండా వుండాలంటే అవలంబించాల్సిన పద్ధతులు వెనక చెప్పివున్నా. కానీ, జబ్బువల్ల కళ్ళజోళ్ళకు దాసులై వుండేవాళ్ళు వాట్నుంచి తప్పించుకోటానికి మిసెస్. జే. కమింగ్స్ అనే అమెరికాస్త్రీ కొన్ని సూచనల్ని చేసింది. అవి:—

1. కళ్ళజోళ్లు మాని సూర్యుడి వెల్తుర్లో ఆకాశంవేపు చూపు యెంతదూరం సాగితే అంతదూరం ఊరికే కొంతసేపు చూట్టం అలవాటు చెయ్యాలి.

2. కనుగుడ్లను మొదట యెడంవేపుకూ. తర్వాత కుడివేపుకూ, కొంతసేపు తిప్పటం అలవాటు చెయ్యాలి.

3. కనుగుడ్లు పైకెత్తి ఎడంవేపుకూ, కిందికీ తర్వాత కుడివేపుకూ, యిలాగే మళ్లీ ఎడంవేపుకూ చూస్తూండటం అలవాటు చెయ్యాలి.

4. కళ్లను గుండ్రంగా తిప్పాలి. ఎడంవేపునుంచి కిందుగా పైకి పోనిచ్చి కుడివైపు కిందికి తిప్పాలి. యిలాగే కుడినుంచి ఎడంవేపుకి తిప్పాలి.

5. కళ్లు వున్నట్టుండి మూసి కనురెప్పలుచేర్చి వీలైనంతవడిగా శక్తికొద్దీ తెఱచి మళ్లీమూస్తూ యిలా అలవాటు చెయ్యాలి.

6. కళ్లకు అరిచెయ్యి అడ్డపెట్టి కళ్లమీదపడే వెల్తుర్ని ఆపాలి. అరిచేత్తో కళ్లు నొక్కగూడదు. కొంచెంసేపు కళ్లు తేలిగ్గా నలిపి చెయ్యి తీసెయ్యాలి.

పైన చెప్పిన పన్లన్నీ రోజూ అలవాటుగా చేస్తూంటే దృష్టి బాగుపడుతుంది. కళ్లు మూసుకున్నప్పుడు ఆకాశంరంగువి గానీ, నల్లరంగువి గానీ పొగతీగల్లా వుండే చారలు కనిపిస్తాయి. ఇలా కనిపించాయంటే కళ్లు బాగుపడుతూన్నాయి అన్నమాట.

# తిక్కన్న—కీచకుని వలపు

రా

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారుద్యమించిన "భారతకథాప్రబంధము" నైకాంతికముగ విచారించిన నది శ్లాఘ్యమయిన ప్రయత్నముగనే తోచుచున్నది. ఉపాఖ్యానములు తత్త్వవిచారములు ధర్మప్రబోధములు గొప్పవిషయములుగ నున్నను ఇవి మహాభారతకథాకథానమునకు కావలసియుండవు. కావున అట్టివాని తొలగించి కేవలైతిహాసికరూపమున భారతకథం దెలుపుటయు యుక్తమే. పామరలోకమునకు కావలసినదియే. కథాసందర్భమును మాత్రము పురస్కరించు[illegible]కొని మూలములోని వాక్యములచే కా[illegible]రూపమున నొకగ్రంథమును నిర్మింప[illegible]ను. అయితె శుష్కముగ మూలగ్రంథములోని గద్యపద్యముల నేర్చి కూర్చుటయందు కథాప్రణాళికప్రవాహముగ నడచుటకై (అందందు 'అంత', 'అప్పుడు', 'అటులని' 'వ్యాసుడు పలికెను.' 'ద్రౌపదితో నిట్లనియె.' 'శ్రీకృష్ణు డిట్లు

చెప్పెను.' ఇత్యాది కట్టువాక్యములు పూర్వాపరసంబంధముల దెలుపుటకై యావశ్యములై యుండగలవు. ఈయుద్దేశపూర్తికై) ఒక్కొకచో మూలములోని గద్యపద్యములను గూడ కొలదిగ సవరింపవలసియుండును. ఇట్లు చేయుటచే గ్రంథమొక పరిపాటిగలదియై కావ్యస్వరూపముగలదై ఆంధ్రలోకమున కుపయోగింపగలదు. మహాభారతములో నున్నటుల వాల్మీకిరామాయణమున 'వ్యాస ఉవాచ' 'శ్రీభగవాన్ ఉవాచ' ఇటువంటి కట్టువాక్యములు లేనందున వ్యాఖ్యాతల కొక్కొమారు కష్టము తోచి 'అత్రేతి కర్తవ్యం' (అత్ర-|-ఇతి-|-కర్తవ్యం = అత్ర= ఇచ్చట—ఇతి=ఇట్లనుట, కర్తవ్యం= చేసికొనవలయును.) అను హెచ్చరిక చేయబడుచున్నది.

ఇక ఈ నూత్నప్రయత్నమును కేవలముగ భారతమును సంగ్రహము చేయుటయని మాత్రమే గణించినను ఆట్టిదానియందును తప్పేమియులేదు. భారతసంగ్రహము—రామాయణసంగ్రహము అను పేళ్లతో ననేకపద్యగద్యకావ్యము లున్నను ఆట్టివి ప్రాయికముగ ఆయా గ్రంథకర్తల రచనలుగ నున్నవి. శ్రీరెడ్డిగారి యుద్యమము కవిత్రయము వారి మాటలచేతనే భారతకథను సంగ్రహింపనున్నది. ఈప్రయత్నము నెరవేరుటకై యొచటనైన నొక పద్యమును మూలములో నున్నటులుంచక కొలదిగ మార్చుటయు యవశ్యము కావచ్చును. అంతమాత్రమునె నిది మూలవ్యాఘాతప్రయత్నముగ భావింపబడనక్కరలేదు. ఆట్టి మార్పులను అందుకు తగినగుర్తులచే తెలుపవచ్చును. భాషాంతరములలో నిట్టి సంగ్రహము లున్నవి. ఇంగ్లీషులో హ్యూము వ్రాసిన గొప్ప ఇంగ్లాండుచరిత్ర మున్నది. పాఠకులందరు దీని జదువజాలనందున Student's Hume అనునొక సంగ్రహ మేర్పడినది. అటులనే Student's Blackotone, Student's Austins, Student's Mill ఇత్యాదులున్నవి. సంస్కృతమున 'లఘుకౌముది' యొకటి యున్నదిగదా. దీనిలోని సూత్రములన్నియు పాణినీయములే. సిద్ధాంతకౌముది చాల పెద్దగ్రంథమగుటచే దానిలోని విషయమునే లఘుకౌముది సంగ్రహము చేసినది. ఇటులనే చాల గొప్ప గ్రంథమగు భారతమును మూలములోని గద్యపద్యములచేతనే సంగ్రహరూపమున వ్రాయుట నిరవద్యము కాగలదు. కవితాధోరణిలో కవిత్రయము వారిద్దియైన యొక మాటనుగాని భావమునుగాని స్ఫుటముచేయక అధ్యాహారముగ విడిచియుండినచో ఆట్టివాని నీరెడ్డిగారి ప్రబంధము విపులము చేసినను మూలావిరోధముగ జేయవచ్చును. ఈవ్యాహారమును కొలదిగ శ్రీరెడ్డిగారి కీచకద్రౌపదీ ఘట్టమున (ఆంధ్రభూమి 1938 సంవత్సరపు జనవరి సంచిక జూడుము) చూపబడియున్నది. మూలగ్రంథమును విపులతరము చేయుటయే వీరి సంకల్పముగాని కవిత్రయమునకంటె పైచేయి యనిపించుకొనవలయునని కాదని తోచుచున్నది. కురుపాండవచరిత్రమున కెట్టు సంబంధమును లేని యుపాఖ్యానములు వివరణములు యెన్నియో భారతమున నున్నవి. వరుసగ కథమాత్రమే నొకకావ్యసరణియందున్న పాఠకులకు సహాయకరముగ నుండగలదు. ఇట్లు సంగ్రహించిన నిది కావ్యరూపమున నుండునని శ్రీ రెడ్డిగారి తాత్పర్యమని తోచుచున్నది.

—ఒంగోలు వెంకటరంగయ్య, బి.ఎ., బి.ఎల్.

౯

ఇంగ్లీషులో విఖ్యాత కవిపుంగవుల సుప్రసిద్ధరచన లన్నిటికీ కూడా కుదించిన కూర్పు లున్నవి. అతివిరళంగావుండే అసలుగ్రంథాలను బోలిజేసి పోసికొనక్కొగిలవారై ఉండరు ప్రతివారున్నూ. అదీగాక, ఆఉద్గ్రంథాల కిరణాలు విద్యార్థులకు ప్రసరింపజేసి, అంతకంతకు జీవితం వెళుతున్నకొద్దీ అసలు గ్రంథాలలోని అందచందాలు తెలుసుకుని ఆనందించదగ్గ పిపాస కల్గ చెయ్యడానికికూడా, సంగ్రహంగా కూర్చిన ముద్రణలు అత్యగత్యం. ఈ ప్రయోజనాలు నెరవేర్చడానికే విదేశ పుస్తక ప్రకాశకులు ఒక్కొక ప్రసిద్ధరచనకు—విద్యాధికులకు, విద్యార్థులకు, పీఠినిపొయ్యే పాటకజనానికి, గ్రంథాలయాలకు, అనువుగా—వేరేవేరే ఎన్నెన్నో రకాలకూర్పులు, వివిధములయిన వెలలు పెట్టి ప్రకటిస్తారు. అన్నికూడా మూలానిక భంగం లేకుండాను, రసం చెడకుండాను ఉండేటట్టు చూస్తారు.

ఇట్లాటి ఉద్దేశంతోనే యిప్పుడు శ్రీ వేంకటకృష్ణారెడ్డిగారు—సుమారు పదిహేను రూపాయలకుగాని లభించని భారతపద్యకావ్యాన్ని, బహుశా ఏ ఒకటి రెండు సంపుటాల్లోనో అందరికీ అందుబాటులో వుండేటట్టు కుదించ దలిచినట్టు తోస్తుంది. శ్రీవారు ఉద్యమించినది శ్లాఘనీయమైన యత్నము. మన తెలుగు వాఙ్మయానికి క్రొత్త అనిన్ని చెప్పవచ్చు.

పండితాభిప్రాయంకోసం అక్కడక్కడి ఘట్టాలు ప్రకటించి చవిమాపడంకంటె, ఒక సంపుటి వెలువరించి, జనబాహుళ్యం దాన్ని యెలా అందుకుంటుందో చూచి నిర్ధారించడం మేలేమో!

—ముద్దా విశ్వనాథం.

ఈరెండును జనవరి 'ఆంధ్రభూమి'లో శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు సంగ్రహించి ప్రచురించిన తిక్కన కీచకుని వలపు ఘట్టపు పద్యములను గూర్చియు, వారు తలపెట్టిన భారతకథాప్రబంధప్రచురణమును గూర్చియు ఆంధ్రవిద్వాంసులు పంపిన అభిప్రాయములలోనివి.

—సంపాదకుడు.

# ఏడాదిలోపల తండ్రిని కావాలి

చిన్న కథ

ఈ కథానాయకుడు
మొదట పెళ్ళి వద్దనుకుంటాడు.
పిమ్మట పెళ్ళికావాలి కాని పిల్లలు వద్దనుకుంటాడు.
ఆపిమ్మట పిల్లలున్నూ కావాలనుకుంటాడు.
కాని ఈలోగా జరిగిన వివేకభ్రష్టసంపాతం వల్ల
తుదికోరిక తుదిముట్టనికోరిక ఔతుంది.

రచయిత:

గౌరావఝుల వెంకటసుబ్బరామయ్య

౧

రఘునాధుడు బి. ఏ. ప్యాసుచేశాడు. వయస్సు 20 సంవత్సరాలు. ఇంకా వివాహం కాలేదు. పెండ్లి అంటే అతనికివున్న అయిష్టతను చూచి ఇంట్లో ఆడవాండ్లు పడుతూన్న దిగులుకు అంతులేదు. రిటైర్డు రైల్వేక్లర్కు సుబ్రహ్మణ్యం రఘునాధునికి బ్రహ్మచర్యాన్నిగూర్చి ఉపదేశిస్తూ వుండేవాడు. అతనికికూడా ఇతని పట్టుదలమీద ఆశ్చర్యం కలిగింది. దానికిప్పుడు ప్రతికూలాభిప్రాయమివ్వడానికి సుబ్రహ్మణ్యానికి మనస్సు అంగీకరించడం లేదు.

ఈవిషయంలో కుమారుడితో తర్కించి ఉన్నగౌరవం పోగొట్టుకోవడానికి తండ్రి గోవిందబాబుకు ఇష్టంలేదు. అతని ముందర ఎవ్వరూ పెండ్లిమాట ఎత్తకూడదు. ఒకదినం భోజనసమయంలో మేనత్త భయపడుతూనే పెండ్లిమాట ఎత్తితే రఘునాధుడు ఇస్తరి వదలి లేచిపోయాడు. పెద్దలు పెండ్లిసంగతి ఎత్తితే మౌనంతాలుస్తాడు. సమవయస్కులు ఆసంగతి ఎత్తితే వారితో తర్కించి పెండ్లి అంటే అతనికివున్న అయిష్టతను వెలిబుచ్చుతాడు. ఆవూరివారందరూ పెండ్లిఅంటే ఇతనికి వున్న అయిష్టతను చూచి ఆశ్చర్యం పొందుతూ వుండేవారు.

రఘునాధుడు సుబ్రహ్మణ్యాంయింటికి పోవడం ఇప్పుడు బొత్తుగా మానివేశాడు. అదిన్నీగాక అతనిని చూచుటకూడా ఇతనికి భయంగావుండెను. తన తండ్రిమాటవిని పెండ్లి చేసుకోమని అతను ఎక్కడ వేపుతాడోనని ఇతని దిగులు.

ఒకదినం సుబ్రహ్మణ్యం, గోవిందబాబు కలుసుకొని రఘునాధుని విషయమై ముచ్చటించి ఇద్దరూ కలసి ఒక వుపాయం ఆలోచించేరు.

౨

మరునాడు సుబ్రహ్మణ్యం భోజనంచేసి మామూలుగా బజారుకు పోలేదు. ఇంటివద్దనే వుండిపోయి రఘునాధుడు మధ్యాహ్నంభోజనానికి పోతూండగా పిలిచాడు. రఘునాధునకు ఆశ్చర్యం, కొంచెం సంకోచం కూడా కలిగింది. విధిలేక ఇంటిలోనికి పోయినాడు. ఇద్దరూ కూర్చొనిన పిమ్మట—

సుబ్ర:—రఘూ! ఎమ్.ఏ. చదువుతావా?

రఘు:—నాఉద్దేశంకూడా అదే.

సుబ్ర:—నీవుద్దేశం వుంటే అడ్డేముంది?

రఘు:—ఇంట్లోవాళ్ళదే.

సుబ్ర:—ఏమీ?

రఘు:—ఇదే, ఇంట్లోవాళ్ళందరూ పెళ్ళిచేసుకోమని వేపుతున్నారు. నాఉద్దేశం మీకు తెలియనే తెలుసుగదా!

సుబ్ర:—ఏమిటీ! ఇంతవరకూ నీవా విషయంలో దృఢసంకల్పుడవై య్యే వున్నావా? (అని ఎరుగనివానివలె ప్రశ్నించాడు.)

రఘు:—ఆఁ ఔనండి (—రఘునాధుని మనసు ఆనందంతో నిండిపోయింది:—) నన్ను వా

ళ్ళ వీళ్ళ మాదిరి అనుకున్నారా? నేను ఎన్నడూ పెండ్లి చేసుకోని చిక్కుల్లో పడను—దేశ సేవా మార్గమును కంటకాకీర్ణం చెయ్యను — బానిససంతానం వల్ల భూభారాన్ని పెంపొందించను.

సుబ్ర:—శభాష్! రఘూ! శభాష్!! నిజంగా, ప్రపంచంలో నీబోటి దృఢప్రతిజ్ఞులే—కర్తవ్యపరాయణులే— కొద్దో, గొప్పో చెయ్యగలరు.

రఘునాధుని ముఖము విజయగర్వంతో కళకళలాడింది.

౩

రిటైర్డు క్లర్కు సుబ్రహ్మణ్యం మేనగోడలు అందరికీ నచ్చింది. చక్కని చుక్క. ఎనిమిదోక్లాసు వరకు చదివింది. ఆస్తంతా ఇస్తామన్నారు. అయినా రఘునాధువద్ద లాభంలేకపోయింది. అందరూ ఇతని వెర్రిని పోగొట్టాలని లోలోన విశ్వప్రయత్నాలు చేయసాగారు. ఇద్దరు ముసలివాళ్లు—సుబ్రహ్మణ్యం, గోవిందబాబుల— అభిప్రాయాలు ఏకమైనాయి. ఇద్దరి నిశ్చయం ఒకటే. ఆనిశ్చయపూర్తికై చేయు పన్నాగం నెరవేర్చేటందుకు పనులు చురుకుగా జరుగుతున్నాయి.

౪

ఆమె దూరం సంబంధంలో మేనత్తవరుస. వచ్చి వారంరోజులైంది బీదది. వెంట ఏమీ సామానులేదు. రెండుమూడు రోజుల క్రిందట వివాహచర్చ జరిగింది. నాలుగోరోజున వచ్చి హాజరైంది—16 సంవత్సరాలబాల.

రఘునాధుడు ఇంతకుముందు ఆమెను చూడలేదు. సరికదా, పేరైనా వినివుండలేదు. ఎవతో అయివుంటుం దనుకున్నాడు. అదిగాక ఇంతవరకు ఇంటివిషయమై తెలుసుకోవలసిన అవసరం ఏమీ అతనికి లేకుండావుండేది. ఇంతవరకు అతగాడు పుస్తకాలు, టెన్నీసు, క్లబ్, సినీమాలు వీటిల్లోనే మునగానాం తేలానాం.

మరి యీపిల్లో?...

ఎక్కడో చూచినట్లున్నదే! మనస్సును ఆకర్షిస్తున్నదే! చూచి కొంచెం సిగ్గుపడుతాడు. సిగ్గుపడితే గుట్టు బైటపడుతుంది. పోనీ, మాట్లాడుదామా? సిద్ధాంత భంగమౌతుందని భయం. ఈ రెండూ కాకపోయినా నలుగురిలో ఎగతాళిపంచాంగం ఔతుందని బెంగ. ఇందువల్ల కాలాన్నంతా బైటనే గడపసాగాడు మిత్రులసహవాసం గిట్టదు. టెన్నీసు రుచించదు. క్లబ్కుపోవటమే లేదు. సినీమా రాత్రిపూటవస్తువ. ఇందువల్ల పగలల్లా పార్కుల్లో, నదిఒడ్డున, ఐతిహాసిక శిథిలభవనాల్లో గడుపుతున్నాడు. సిద్ధాంతభంగభయం, పాపం అతన్ని అకస్మాత్తుగా ఎంత భావుకుణ్ణి చేసింది!

౫

నేడు మరల రఘునాధుని సుబ్రహ్మణ్యం పిలిచాడు. 'ఎక్కడవుంటున్నావు? ఏంచేస్తున్నావు? ఇంటితో ఎందు కింతవైరాగ్యం వహించావు?' అని అడిగాడు.

రఘునాధుడు అతనికి ఆత్మసమర్పణచేస్తూ, ఇట్లుచెప్పేడు: 'తాతగారూ! నేడొకమాట మీతో చెప్పతలుచుకున్నా. దానికై నన్నే మీ అనవద్దు.'

సుబ్రహ్మణ్యం వప్పుకున్నాడు.

రఘు —నేను ప్రస్తుతం వివాహ విషయమై గంభీరంగా ఆలోచిస్తున్నా. (కొంచెంఆగి) చూడండి! నన్ను ఏమైనా అనండి. వివాహంచేసుకోతలుచుకున్నా. ఇది నాకు నచ్చింది...తరువాత మీయిష్టం.

సుబ్ర —వాహ్! ఇందులో నా యిష్టం ఏముంది! ఇదిస్వాభావికమే. ఇరవైరెండు సంవత్సరాలవాడివైనావు. తలిదండ్రులకు ఏకపుత్రుడవు—ఇలాంటప్పుడు పెండ్లి చేసుకోకపోతే...

రఘు—ఆఁ. నేనూ ఎంతో ఆలోచించా. కుటుంబంలోని పెద్దల్నందర్నీ కష్టపెట్టటం బాగుండదని తోచింది.

సుబ్ర—నిజమే...

రఘు:—ఇక దేశసేవ. సంగతి ఏమిటంటారేమో! దేశసేవకి సంతానం ప్రతిబంధకంగాని భార్యకాదు. ఇక సంతానమా, అది చేతిలోని పని. పురుషునికి సంయమంగావుండటం ముఖ్యావసరం.

సుబ్రహ్మణ్యం రఘునాధుని రంగుమార్పుచూచి లోలోన నవ్వుకొని "అంతా బాగున్నది. నీవు త

ష్యక పెండ్లి చేసుకోవలసిందే. పెళ్లి బూర్లుతిని చాలారోజులైంది.'' అని నవ్వుతూ అన్నాడు.

పిమ్మట రఘునాధుడు శెలవుతీసుకొని బయటికివచ్చేడు. నాలుగైదు నిమిషాలు గోడకు చెవియొగ్గి విన్నాడు, తన పరివర్తనానికి సుబ్రహ్మణ్యం నవ్వుతున్నాడేమోనని. కాని సుబ్రహ్మణ్యం దీన్నిగురించి ఎందుకు నవ్వుతాడు? మందుపట్టిందికదా అని లోలోన సంతోషించాడు.

౭

పెండ్లి అయింది. నిగ్రహంఅనే పాతపేలికలు గాలిలో ఎగిరిపోయినాయి. ఇప్పటికిన్నీ సంతాననిరోధపక్షపాతే. వ్యత్యాస మేమిటంటే మొదట సంయమంతోటి సంతాననిరోధం కావాలని, ఇప్పుడు సంయమాన్ని కోరని ఇతరసాధనాలతోటి సంతాననిరోధం కావాలని.

సంతాననిరోధమహిమను స్వయంగా తెలుసుకున్నాడు. పెండ్లికుమార్తెకు దీన్నిగురించి గంభీరంగా తెలుపసాగేడు. 'మేరీ స్టోప్సు' గ్రంథాలన్నీ తిరగేశాడు. 'మాల్థుసియన్ థియరీ' భక్తుడైనాడు. సంతాననిరోధానికి (బర్తుకంట్రోల్) సమస్త ఉచితానుచితోపాయాలు చేయసాగేడు.

స్నేహితుల్తో బడాయిలుకొట్టేవాడు. బ్రహ్మచర్యం, సంతాననిగ్రహం వీన్నిగురించి ఉత్సాహంగా ఉపన్యసిస్తూ, సంయమశక్తిలేని దుర్బలవివాహిత మిత్రులను ఎగతాళి చేస్తుండేవాడు. అనుభవజ్ఞులు ఇతని మాటలు విని నవ్వేవారు. సుబ్రహ్మణ్యంగూడా గమనిస్తూవుండేవాడు. నవ్వేవాడు కాడు.

౮

'రఘునాధబాబూ! ఏమిటిది?'

వారంగడిచింది. నెలగడిచి రెండోమాసంగూడా ప్రవేశించింది. వారిప్రేమ దినదినాభివృద్ధి చెందసాగింది. రఘునాధుడు పూర్వచరిత్రకూ ఇప్పటిదానికీ తారతమ్యం చూచుకునేవాడు. ప్రతిక్రియలన్నీ వ్యర్థమయ్యాయే! జాగ్రత్తంతా వ్యర్థమైందే! కాపరం ప్రారంభించి ఆరునెలలుకూడా నిండలేదే! చింతాక్రాంతుడైనాడు. స్టోప్సుపుస్తకాలన్నీ తిరగేశాడు. వైద్యగ్రంథాలన్నీ చదివాడు. చిటుకాలు ఏరుకున్నాడు. ఒకరోజున బలవంతంగా మందు తాగించాడు.

౯

ఐదుసంవత్సరాలు గడిచినాయి. దేశసేవాకార్యము నిలబడిపోయింది. రఘునాధుడు సంసారసాగరంలో పడ్డాడు. పొట్టతిప్పలకొరకు పని వెతుక్కోవాలసి వచ్చింది. కాని ఇదీ ఒకసుగుణమే—ఇంతవరకు సంతానం కలుగలేదు. ఆహా! ఎంతచక్కని జబాబు! ఒక ఔన్సుతో పని పూర్తి అయింది.

రఘునాధు డిప్పుడు నోటితో ఏమీ చెప్పడు. లోలోన ఆమందును తిడతాడు. ఆపుస్తకాలను పరశురామప్రీతి చేశాడు. మేరీస్టోప్సును, మాల్థుస్సును తెరిపిలేని శాపాలకు గురిచేస్తున్నాడు.

ఇరవై రెండుసంవత్సరాల లోపుగా ఆడదానికి సంతానం కలక్కపోతే ఇకముందు కలగటం దుర్లభమని ఎవరోఅన్నారు. ఇంకేముంది? సంతానంకోసం విశ్వప్రయత్నం చేయసాగాడు. ఒక్కమొగపిల్లవాడు, లేకపోతే ఒకఆడపిల్లైనా చాలు. ఇదే అతనుకోరేది. ఇదికూడా లేకపోతే ప్రయోజనమేమున్నది? పెండ్లి చేసుకున్న దెందుకు? పిల్లలకేగా మరి?

ఐతే దీనికోసం పాతళ్లాడటం పనికిరాదు అని అనుకుంటాడు. కాని మరుక్షణంలో ఈతర్కాలతో అవసరంలేదు, ఈవిచారాలతో పని లేదు. ఇప్పుడు సంవత్సరంలోపల నేను తండ్రిని కావలె. ఏమన్నా కానీ, ఎంతైనా డబ్బుఖర్చు కానీ అని అనుకుంటాడు.

మరి దేశసేవో?

'ఉండవయ్యా! అది ఇప్పుడు చెప్పవలసింది కాదు. వీలైనంత తొందరగా తండ్రిని కావలె. వంశనిర్మూలం కాకుండా చెయ్యావలె.'

రెండుసంత్సరాలనుంచి డాక్టర్లు నాటువైద్యులు, లేడీడాక్టర్లు, మందులుఇచ్చి విసికారు. వాళ్లనుంచి కేసు భూతవైద్యులు, సాధువులు, సన్యాసులు, ఫకీర్లు, జడదారులు వీళ్ల పాలిటపడ్డది. సంతానం కలుగుతుందంటే చాలు. వాడిపంట పండినట్టే. విభూతి పెట్టేవాండ్లకు, దిష్టితీసేవాండ్లకు అంతులేదు.

ముసలితలిదండ్రుల చింతకు వే

రేలేదు. ఇక భార్యాభర్తలకో? వారి మనోభావం వర్ణనాతీతం. ఒకరి మనోభావాన్ని ఒకరు వెలిబుచ్చరు. వారి మనస్సులు సంకోచంవల్ల కుందుతున్నాయి.

రఘునాధుడు నేటికి జిమ్మేదారీ తెలుసుకున్నాడు. ఇతరపిల్లల్ను దగ్గరతీయ మొదలుపెట్టాడు. పిల్లలంటే గిట్టనివాడు నేడు పరాయిపిల్లల్ను అబ్బాయీ! ఇలారమ్మా, అని అతిప్రేమతో పిలువసాగేడు. అప్పుడు అతనికి చిత్తశాంతి కలిగేది. తన ఆయావనోద్ధృతపు తొందరకు తన్ను ఎన్నిసార్లు తిట్టుకున్నాడో, ఆమంఋను ఎన్నిసార్లు దూరినాడో, ఆమంఋను సృజించిన భగవంతునికూడా ఎన్నిసారులు దూషించినాడో...

౯

పిల్లవాడుకలిగే యోగంలేదు, కలుగలేదు. రఘునాధుడు వృద్ధుడైనాడు. కాని అతనికిప్పుడు అంత సంతానేచ్ఛలేదు. దీన్ని అదృష్టమందామా? కర్మఫలమందామా? అదృష్టాన్ని అతను ఒప్పుకోడు. ఒప్పుకోనేదిమటుకు ఎల్లా? తనుచేసిందానికి చికిత్సో? అప్పూరి బీదపిల్లలకు పుస్తకాలు, గుడ్డలు, స్కూలుజీతాలు మొదలైన సహాయం చేయసాగేడు.

ఒకరోజున అతను వార్తాపత్రికలో అతనిస్నేహితుని కుమారుడు సివిల్ సర్వీసులో ప్రవేశించెనని చదివేడు. కొంతసేపు విచారసాగరంలో మునిగిపోయాడు.

ఇంతలో ఒకపిల్లవాడువచ్చి—తాతా! నేను పరీక్షలో అందరికంటె ఫస్టున ప్యాసుఅయినాను—అని చెప్పెను. అతను సంతోషించి ఆ పిల్లవాని వీపును నిమురసాగేడు.

ఒకరోజున అతనిమిత్రుడు ఒకడు విందుకు పిలిచేడు. అతనికుమారుని వివాహము. మరల రఘునాధునిముఖము ఖిన్నమైపోయింది.

కాని ఇంతలో అతనిభార్య ఒక పిల్లవానిని ఎత్తుకొనివచ్చి—వీణ్ణి బజారుకు తీసుకుపోయి మిఠాయికొని పెట్టండి. పాపం చాలాసేపటినుంచి యేడుస్తున్నాడు అనిచెప్పెను. రఘునాధుడు నవ్వుచు ఆపిల్లవానిని ఎత్తుకొని బజారుకు తీసుకొనిపోయాడు.

"సీ. జలధరంబన నెద్ది వీలపంబు పుట్టించు నిల్లాలి మెఱుఁగుల మొల్లమునకు
మున్నీరనఁగ నెద్ది మొలచుట కావాల మాణిపూసలువోని యాత్మజులకు
గీ. నట్టి గృహమేధిధర్మంబునందు నీవు, గుత్ససేయుట నీరీతి గొడవయొదవె
నొప్పగతి నొప్పఁగనఁగల్గ దుద్ధతులకు, గసరిపైవచ్చు జాళ్ళపై గాలియైన."




౨౦౮

## విపంచి-కాత్యాయని

ప్రకటన కర్తలు : నమ్మాళ్వార్స్, పోస్టుబాక్సు 251—మద్రాసు

కావ్యకర్త : బొడ్డు బాపిరాజు—క్రౌను సైజు. దళసరి ఆంటిక్ కాగితములు. 116 పుటలు. వెల ఆరు అణాలు.

బాపిరాజు గారి కవిత్వం ఆంధ్రభూమి పాఠకులకు చిరపరిచితమైంది. శ్రీవారు లక్ష్మీసరస్వతుల పూర్ణానుగ్రహంపొందిన జమీందారీవైశ్యులు. వీరినిగూర్చి ఈ గ్రంథంలో ప్రకటనకర్తలు వ్రాసిన 'చూపు లక్షలకొద్దీవున్న వ్యాపారంమీదా; తలపు క్రొత్తక్రొత్త వ్యాసాలమీదా' అనే వాక్యం మినహాయింపులేని సత్యాన్ని తెలిపేదేకాని అన్యమైందికాదు.

విపంచి, కాత్యాయని ఈరెండున్నూ బాపిరాజుగారు రచియించిన ప్రత్యేక కావ్యాలు. విపంచి యువవసంతంలో ప్రచురితమైంది. కాత్యాయని ఈశ్వర గ్రీష్మంలో ప్రకటితమైంది. విపంచి వెల నాలుగుఅణాలే అగుటచే ప్రచురితమైన కొద్దికాలంలోనే అన్నిప్రతులు చెల్లిపోయినాయి. కాత్యాయని విలువలేనిది. అగుట రెండింటికిని రెండవముద్రణావసరంకలిగింది. ఈరెండవముద్రణాదికార్యమునకు నమ్మాళ్వార్సు పూనుకొనుటచేత ఉచితోపయోగ్యవృత్తి కల్గింది. రెండుకావ్యములున్నూ ఆంధ్రులకు ఏకసంపుటమున 'ఉద్యన్మనోహరాకృతిని' అల్లారుముద్దుగా లభ్యమైనాయి.

ఆధునికకవుల కావ్యాల్లో 'విపంచి' పొల్పడినంత ప్రశంసను మరి యేకావ్యమున్నూ పొల్పడలేదు. సౌకుమార్యాన్ని వెల్లివిరిసే ఇందలిపద్యాలూ, నిర్దుష్టమైన ఇందలిసంగీతమూ, హాయినిగూర్చే ఇందలి శైలీ విమర్శకమణులైన నండూరి బంగారయ్య (బి. ఏ) గారి ప్రశంసకూడా పొందాయి. మచ్చుకి ఒకపద్యం:—

చ. చెదరినముంగురుల్ చెమటచిత్తడి-
జెక్కులనంట, మట్టియల్
మృదులరవమ్ములం జెవుల నింపులు
నింపగఁ బచ్చగడ్డినిం
బదిలఁపు మోపుఁగట్టి తలపై
నవరించి పొలాలగట్లనె
మ్మదిఁజనుఁగాఁపుచిన్నది సుమాళఁపు
పల్లెపదాలు పాడుచున్.

ఇక 'కాత్యాయని' బాపిరాజు గారి 'కావ్యలతాంతసంతతికి'ఇంతకంటె హెచ్చుగా 'మాధురీభిక్షముల్' పెట్టింది.

అనాడు నన్నయ్య మహాకవి
...ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబుఁ జందనముఁ
జంద్రజ్యోత్స్నయుం బుత్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు
హృద్యంబే కడున్ శీతమే.

అని మనోహరంగా పాడినట్లే ఈనాడు బాపిరాజుకవి 'నిత్యానుభోగ్యమహానందరసస్వరూపమగు' ఆత్మతనయ కాత్యాయనీదేవి ఏడాదిపొడుగుములు 'రస్యమానములయిన' చక్కనిమాటలతో పాడుతున్నారు.

మచ్చుకి రెండు రసగుళికలు :

'తూగుటుయ్యాలలో వూగవే తల్లి!
ఆగినవి పనులెన్నొ అరిగివచ్చేన?
అత్తింటికోడల్నె అనిపించవద్దు!
వొత్తిగిలిపండుకో వోచిన్నముద్దు!'
'అల్లనప్పైదవుల నద్దినట్టి పర
మాన్నములోపల నున్నతియ్యదన
మెల్లయెడల నీచల్లనిపలుకున
యిల్లుగట్టుకొని యెసగుత బిడ్డా!
'ఆటలను పాటలను యేటికేడాది చిటికలోగడిపి చిలిపిచిత్రాంగి' అయి తండ్రిచేత ఆంధ్రులికి మంచికావ్యాన్ని ఓదాన్ని ఇప్పించిన కాత్యాయనీదేవి తల్లి కడుపు చల్లగా, అత్తకడుపు చల్లగా నూటిమీద నూరేళ్ళు వర్ధిల్లాలని ఆంధ్రభూమి దీవిస్తూవుంది.

—రామ

౨౦౯

## గంగాలహరి

కృతికర్త : శ్రీ మోచర్ల రామకృష్ణయ్య, నెల్లూరు. దళసరి డ్రాయింగు కాగితములపైని సుందరమగు ముద్రణము. వెల ౮ అణాలు.

సుప్రసిద్ధ సంస్కృతమహాకవి జగన్నాథ పండితరాయలవారి రచతమగు 'గంగాలహరి' భక్తిరసప్రధానమై, అత్యంతమనోహరమై, అమృతలహరివలె నలరారుచుండును. ఆకారణముననే ఇది పెక్కండ్రు తెలుగుకవుల హృదయముల నాకర్షించినది. బ్రహ్మశ్రీ ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి గారును అల్లమరాజు రంగశాయికవిగారును ఈ గ్రంథమునందలి సౌందర్యాతిశయమున బ్రేరితులై, ఈవరకే దీని సాంధ్రీకరించినట్లు తెలియవచ్చుచున్నది.

ప్రస్తుతము శ్రీ రామకృష్ణయ్యగారు రచించిన ఈ'ఆంధ్రగంగాలహరి' ధారాళమైన కవితారచన గలిగి, మృదుమధురముగా నొప్పుచున్నది. భాషాంతరీకరణము సరళముగాను, సహజముగాను కన్పట్టుచున్నది.

గ్రంథాదిని శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రి గారి 'తొలిపలుకు'ను, పండితరాయని వృత్తాంతమును కలవు. ఆంధ్రమహాశయు లీ గ్రంథము నాదరించి,

కర్తగారి కవితాపరీక్ష నామోదింతురని ఆశించుచున్నాము.

శైలి తెలియుట కొకపద్యము.

మ. చెలువారన్ సగమైన నాలుగల జే
జే జూటమున్ జాతి, కో
మలమౌ పాపట పట్టునన్ బఢ, సహిం
పన్ లేక సాపత్న్య సం
చలనోగ్ర స్ఫురితాక్షియై గిరిజ రో
షంబూని, యాత్మీయ మం
జులహస్తమ్మునఁ జిమ్మ నీయలలు పొం
ల్చుంగాత మమ్మోముచున్.

—విశ్వనాథం.

౨౧౦

## బహుధాన్య గంటల పంచాంగం

నిడదవోలునివాసులైన శ్రీ లింగాల బంగారయ్య సిద్ధాంతిగారిచే గుణింపబడ్డది. సంవత్సర సమిష్టిఫలం; ధాన్యాదులకు ధర హెచ్చుతగ్గు నిర్ణయం; వర్షించు తేదీలు; గోచారఫలములు; తారా చంద్రబలాల్ని చూచుకు నేత్రమం; తేనె పట్టువగైరాలకు మంచి చెడ్డలు; బల్లిపతనం; శకునాలు; స్వప్నాలు మొదలైన ఉపయుక్తవిషయాలెన్నో పీఠికలో ఇవ్వబడ్డాయి. జేబునందుఇమిడే చిన్నసైజులో ముద్రింపబడి పంచాంగం ఆకర్షణీయంగావుంది. —యాజ్ఞవల్క్యుడు.

౨౧౧

## ప్రభాపరిష్కారపరిశీలనము

కర్త. దుర్భా సుబ్రహ్మణ్యశర్మ, ఆంధ్రోపాధ్యాయులు, వి. ఆర్. కాలేజి, నెల్లూరు. 80 పుటలు. నాలుగుఅణాలు.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు రచించిన 'రత్నావళి' (హర్షవర్ధనుని సంస్కృతనాటకమునకు తెనిగింపు) అను ఆంధ్రనాటకమునకు శ్రీయుత ధరణికోట వేంకటసుబ్బయ్యగారును, వేఱొకరును వ్రాసిన టీకాపీఠికలలోని వ్యాకరణాదిదోషముల నించుమించుగా నిన్నూటింటిని విద్యార్థులకు విశదపఱచు విమర్శ. అనేకవ్యాకరణమర్మములిందు విశదపఱుపబడినవి. విజ్ఞానమును పెంపొందింపగలదని చెప్పవచ్చును. ఇందలి ప్రతిఅక్షరమును దీనికర్తలగు దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి ప్రజ్ఞాపాండిత్యములను వెల్లడిచేయుచున్నది.

—విద్యార్థి.



౨౧౨

## స్వయంకృతాపరాధం

కర్త. శ్రీరామారావు. కాకినాడ శ్రీపతి ముద్రణాలయంలో ముద్రించబడ్డది. 16 పుటలు. వెల తెలియదు.

బర్తుకంట్రోల్ ను ప్రచారంలోకి తీసుకురావడానికి ఉద్దిష్టమైందిగా కనిపిస్తూవుంది. కథలో జిగిలేదు. మిత్రుని ఉపదేశాన్ని వినకుండా వీరాస్వామి కార్యంచేసుకుంటాడు. చిన్నతనంలోనే భార్య గర్భవతిఅయి ఆస్పత్రిలో ప్రసవించి చనిపోతుంది. అందుచేత అందరూ బర్తుకంట్రోల్ అవలంబించాలని గ్రంథకర్త ఉద్దేశంలా కనిపిస్తుంది. —శర్మ.

౨౧౩

## పశ్చాత్తాపము

కర్త హనుమంతరావు. రాజమండ్రి ప్రభాసిప్రెస్సులో అచ్చుఅయింది. 8 పేజీలు. వెల తెలియదు.

'పేమి' అనేవాడు చిన్నప్పుడే పెళ్లిచేసుకుని ఒకపిల్లను కని పెళ్లాన్నిపోగొట్టుకొని పిల్లసేవలో కాలంగడుపుతూ బాల్యవివాహంవల్ల భావిని పాడుచేసుకున్నందుకు పశ్చాత్తాపంపొందడం ఇందులోనికథ, రచన ప్రాథమికం.

—శర్మ.

౨౧౪

## చీనా జపాను ప్రళయము

కర్త. గాడిచర్ల హరిసర్వోత్తమ రావు. ప్రకటనకర్తలు నమ్మాళ్వార్స్, పోస్టుబాక్సు 251, మద్రాసు.

క్రౌను సైజున 116 పుటలు. వెల ఆరుఅణాలు.

శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావు చీనాజాతీయోద్యమాన్ని గూర్చి రెండు సంవత్సరాలక్రితం ఒకగ్రంథాన్ని వెలువరించారు. దగిమిలాను చీనాసమస్య ప్రపంచరాజకీయాల్లో ప్రాముఖ్యం వహించింది. జపాను చీనామీద దండెత్తడంచేత ప్రస్తుతం అదే ప్రధానరాజకీయసమస్య

అయివుందన్నా కాని అతిశయోక్తి కాదు. ఇట్టిసమయంలో చీనాజపానుప్రళయము అన్నే పుస్తకం ఆంధ్రంలో ప్రకటింపబడడం ఎంతో కాలోచితంగావుంది. కాశేశ్వరరావుగారి గ్రంథాన్ని, దీనిని ఒకసారి కలిపి చదివితే చీనాచరిత్రఅంతా మనకు తెలిసిపోవడమే కాకుండా చీనాసమస్యలో వున్న క్లిష్టతఅంతా మనకు సుబోధకం అవుతుంది.

ఈ గ్రంథాన్నిరచించిన హరిసర్వోత్తమరావుగారు ఆంధ్రులకు చిరపరిచితులు. వారి ఐరోపామహాసంగ్రామ చరిత్ర, వారి రాజకీయపరిజ్ఞానికి మంచి నిదర్శనం. వారు పదిగ్రంథాలదాకా రచించివున్నారు. వాటి అన్నిటికీ చీనాజపానుప్రళయము మకుటంఅని చెప్పవచ్చు.

ఇందు పదహారుప్రకరణాలు ఉన్నా అందుముఖ్యంగా ఐదోప్రకరణం ...న పరదేశజులహక్కులు, ఎనిమిదో ప్రకరణంఅయిన బలిదానము, తొమ్మిదో ప్రకరణంఅయిన జపానుసామ్రాజ్యతత్వ విజృంభణము పరనం చాలా ఉద్రేకాన్ని పుట్టించేవిగా వున్నాయి.

గ్రంథంలో చేర్చబడ్డ చీనాదేశపటం విషయావబోధనానికి ఎంతో ఉపకరించేదిగావుంది.

గ్రంథశైలి తెలియుటకు ఉదాహరణంగా ఒకపేరాఎత్తి ముద్రిస్తున్నాను.

'అతడు స్థాపించిన కళాశాల బునాదిగ నేటి చీనాజాతీయ్యవిశ్వకళాపరిషత్తు నిర్మితమైనది. అతని ప్రోత్సాహముచేతనే మొట్టమొదటి చీనాప్రతినిధులు పరదేశములకుపోయి ఆయాప్రభుత్వములతో కలిసివచ్చిరి. అతడే మొట్టమొదటి లైటుహౌసులు, 'లైటుషిప్పులు', ఏర్పరచి చీనాతీరములయందు నావికాజ్యోతులను వెలిగించెను. నేటి పోస్టు టెలిగ్రాఫు శాఖలను చక్కనిరీతిని ప్రవేశపెట్టెను. ఫ్రాంసు చీనాలకు యుద్ధముకాగా శాంతిసమకూర్చెను. నలుబదియేండ్ల కాలము చీనావారు విదేశజులతో జరుపుకొనిన యేవ్యవహారమునందును ఇతని సలహా సంప్రతింపులు లేక జరుగలేదు.'

ఆంధ్రుని లోకజ్ఞానాన్ని పెంపొందించే ఇట్టి ఉత్తమగ్రంథాన్ని ప్రచురించిన నమ్మాళ్వార్సని విస్తారం వినుతించవలసివుంది. —కృష్ణమూర్తి.

౨౧౭

## ఆంధ్రపుత్రతారావళి

గ్రంథకర్త: బాలకవి ఉభయభాషాప్రవీణ కోగంటి దుర్గామల్లికార్జునరావు, పండిట్, బోర్డు సంస్కృతపారశాల, కైకలూరు, కృష్ణాజిల్లా. క్రౌను సైజున 16 పుటలు. వెల 0-2-0.

అంటరానితనమును నిరసించు పద్యాలసంపుటి. ఈ జాతీయకవితాగానం పోత్సహింపదగింది. కవిత్వం ఉజ్జ్వలంగా వుంటే పాఠకులకు ఉద్రేకమున్నూ కలుగుతుంది; 'దేశసౌభాగ్యసంధానయోగ్యమగు కవితయే నిక్కంపుకవిత' అనిన్నీ అనిపిస్తుంది. రావుగారి భావిరచనలు ఇంకా బాగుంటాయని నమ్ముతున్నాను. —శర్మ.

౨౧౮

## ఆంధ్రరాష్ట్రము

కర్త వావిలాల గోపాలకృష్ణయ్య. క్రౌనుసైజున 48 పుటలు. వెల రెండు అణాలు.

ప్రతులకు డా.సి. సీతారామశాస్త్రి, ది మెడికల్ స్టోర్సు, సత్తెనపల్లి అను చిరునామాకు వ్రాసేది.

ఆంధ్రాభ్యుదయానికి హేతుభూతులయిన కాశీనాధుని నాగేశ్వరరావుగారికి ఈగ్రంథం కృతి ఈయబడడం ఎంతో సముచితంగావుంది.

ఆంధ్రులకుగల రాష్ట్రార్హతను యీ పుస్తకం నూటిగా నిరూపిస్తోంది.

రాష్ట్రాందోళనప్రారంభం, కాంగ్రెస్ లో ఆంధ్రరాష్ట్రం, ఆంధ్రవిశ్వవిద్యాలయం, శాసనసభలలో ప్రత్యేకరాష్ట్ర తీర్మానం, రౌండు టేబిల్ సభలో ఆంధ్రరాష్ట్రం, మొదలయిన విషయాలన్నీ క్రమంగా చర్చించబడ్డాయి. అనేకమైన ఇతర ఉపయుక్తాంశాలుకూడా చేర్చబడ్డాయి. —శర్మ.

## ౨౧౭

## భరతుడు

గ్రంథకర్త· దుర్భా సుబ్రహ్మణ్యశర్మ. నెం. 201 రాయజీవీథి, నెల్లూరు. క్రౌనుసైజున 80 పుటలు. 8 అణాలు.

శ్రీరామచంద్రునిపట్ల భరతుడు చూపించిన సోదరభక్తిని విపులముగా చూపించే నిమిత్తం ఆదృష్టితో రామాయణకథ తేటఅయిన తెనుగువచనంలో చెప్పబడ్డది. పూర్వకావ్యాల్లోంచి ఏర్చికూర్చిన పద్యరత్నాలెన్నో అందందు చేర్చబడి కావ్యంయొక్క రుచిని పెంచేయి. శైలి నిర్దుష్టమైన గ్రాంథికం. అరసున్నల యెడ అమితమైన శ్రద్ధ చూపబడింది. దీనిని ఇంతవరకు ఏడువేలప్రతులు చెల్లిపోయాయి అని తెలుస్తూవుంది. ఇందుచేత ఇది విద్యాశాఖాధికారుల మన్ననను ఎంతవరకు పొందకలిగిందో మనం సులభంగానే వూహించుకోవచ్చు.

—రాజు.

## ౨౧౮

## కలంపోటు

చిన్నకథ. వ్రాసినవారు: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

ప్రకటించినవారు కలాభివర్ధనీపరిషత్తు, ఇన్నీసుపేట, రాజమండ్రి. క్రౌనుసైజున 64 పుటలు. వెల 0-2-6.

కృష్ణదేవరాయలకీ అతనిభార్యకీ అంతఃపురంలో నడిచిన ప్రణయకలహప్రశాంతికిగాను ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణకావ్యరచనకు కడగి పగడబందీగా 'పే రలుకంజెందిన కొంత లుచిత వ్యాపారముల్ నేర్తురే' అనే అర్థాంతరన్యాసాన్ని ప్రయోగించడం కలంపోటు కథకు జీవాన్ని ఇచ్చింది. అయితే కలంపోటు అనడంకంటె గంటంపోటు అనివుంటే బాగుండేదేమో !

కథలో చమత్కారాలయిన సన్నివేశాలుఉన్నాయి. కొన్నికొన్నిచోట్ల సంభాషణ అద్భుతంగావుంది.

కథకు మొదటివాక్యం 'స్థలం విజయనగరంలో శ్రీకృష్ణదేవరాయని సభాభవనం భువనవిజయ' అని. ఈవాక్యం చదవడంతోటే ఇది చారిత్రకకథ కాబోలు ననిపిస్తుంది. అప్పుడు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని సన్నిహితంగా ఎఱిగివున్న నావంటివారికివారు చారిత్రకకథలు జయప్రదంగా వ్రాయగలరా అనే సందేహంవస్తుంది. కాని కథఅంతా చదివినమీదట ఇది చారిత్రకకథకాదనీ చారిత్రకపురుషుని సంసారకథనీ, సాంసారికకథ కాబట్టే శాస్త్రిగారు తమ సహజప్రతిభతో దీనిని నిర్వాహించారనీ అవగతమౌతుంది.

కవిత్వములో రాజకార్యనిర్వాహకత్వం అయిన ఆంధ్రసారస్వతంలోని నిదర్శనాలలో ఇదిఒకటి. ఇది శాస్త్రిగారి రచనకు పాల్పడి రమణీయంగా తయారైంది.

ఇందు ఎత్తి ముద్రించిన పారిజాతాపహరణంలోని పద్యాలు చిన్నతెనుగులో కూర్చివుంటే బాగుండేదని నా అభిప్రాయం. —కథాప్రియుడు.

## ౨౧౯

## విప్లవగీతాలు

ముంగండ విశ్వసాహిత్యమాలవారి ప్రచురణం.

తుమ్మల వెంకట్రామయ్య, నాగేశ్వరరావు, లింగయ్య, పి. లోకనాథం, మద్దూరి అన్నపూర్ణయ్య గరిమెళ్ళ సత్యనారాయణ, బాలకృష్ణ, పి. వెంకటరత్నం, శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు, చదలవాడ పిచ్చయ్యచౌదరి మున్నగువారు వ్రాసినగీతాలు. సామ్యవాద సిద్ధాంతబోధకాలు గాఉన్నాయి. అట్టమీద పైన స్టాలిన్ బొమ్మ, దిగువను లెనిన్ బొమ్మ ముద్రింపబడి గ్రంథప్రచురణోద్దేశాన్ని చాటుతున్నాయి.

—శర్మ.

## ౨౨౦

## స్పెయిన్ దుస్థితి

రచయిత: ప్రతాప రామసుబ్బయ్య.

ప్రకటనకర్తలు: నమ్మాళ్వార్స్, పోస్టుబాక్సు 251, మద్రాసు.

క్రౌనుసైజున 160 పుటలు. వెల ఆరుఅణాలు.

ఇరవైమాసాలుగా స్పెయినులో అంతర్యుద్ధం సాగుతూవుంది. ముసోలిని, హిట్లరు దానిలో వేలుపెట్టి దానికి ఎక్కడలేని ప్రాముఖ్యాన్ని తీసుకువచ్చేరు.

స్పెయిన్ దుస్థితి అనే గ్రంథం ప్రాముఖ్యంవహించిన సమస్యకు సంబంధించి కలిగే జిజ్ఞాసకు మీమాంసఅంతా ఇవ్వగలిగేదిగావుంది. రచన ప్రాథమికంగా ఉన్నా విషయాలన్నీ ఒకరూపంతో వచ్చినందుకు సంతోషించాలి. శైలి వాడుకభాషకూ, గ్రాంథికానికీకూడా చెందకుండావుంది.

పుస్తకం అంతటికీ తటస్థవిధానం అనే ప్రకరణం బాగున్నది. ఆప్రకరణంలోనుండి శైలి తెలియడానికని పదిపంక్తులు ఉదాహరిస్తాను.

'అప్పటికే ఇటలీ, జర్మనీలు వారివారి ఆయుధబలాన్నే కాకుండా సైన్యాన్ని కూడా వేలకువేలు పంపడం మొదలుపెట్టారు. ఫ్రెంచిప్రభుత్వం కొంతమంది ఇటలీవైమానికులు ఫ్రెంచిమొరాకోలో దిగారని మూడు స్పష్టమైన ప్రత్యేక నేరములు వారిమీద ఆరోపించింది. మొట్టమొదటిది, విమానములు రిజిస్టరు కానివనియు. రెండవది, అనుమతిలేనిదే ఫ్రెంచిరాజ్యములో తిరుగుచుండెననియు. మూడవది: యుద్ధసామగ్రిని తీసుకొనిపోవుచుండెననియును.'

రామసుబ్బయ్యగారికి రాజకీయగ్రంథరచనలో నేర్పుఉందని ఈపుస్తకం చాలవరకు రూఢంచేసింది. విషయసంగ్రహంమీద చూపించేటంతటి శ్రద్ధనూ వారు రచనావిషయంలోకూడా చూపించవలసివుంటుంది.

ఏమైనా ఇది ప్రశస్తగ్రంథవర్గానికే చెందుతుంది. ప్రపంచాన్ని తెలుసుకోవాలనుకొనే ప్రతితెలుగువాడున్నూ చదవతగ్గ గ్రంథాల్లో ఇదిఒకటి. —రావు.

# సంపాదకీయ సమాలోచన

## నిజాము విద్యాసంస్థలతో ఐక్యత.

పదిదినముల క్రితము తెనాలిలో కూడిన ఆంధ్రా డిఫెన్సు లీగ్ వారు 'నిజాము ప్రభుత్వమువారితో సంప్రదించి ఆ రాజ్యమునందలి నిజాము కళాశాల, వరంగల్ కళాశాల, గద్వాల హైస్కూలు మున్నగు విద్యాసంస్థలను మద్రాసు యూనివర్సిటీ అఫీలియేషన్ నుండి తప్పించి ఆంధ్రయూనివర్సిటితో అఫీలియేట్ అగునట్లు చేయవలసినదిగ మద్రాసు ప్రభుత్వము వారిని కోరుచున్నాము' అని తీరుమానించిరి. సమగ్రముగ ఆంధ్రదృష్టితో చూచినచో ఈ కోరిక ఎంతయు సముచితమైనది. పైన పేర్కొనిన నైజాము విద్యాసంస్థలు ఆంధ్రము ప్రధానభాషగాగల భూభాగములోనివి. అగుట అవి ఆంధ్ర విశ్వవిద్యాలయముతో అనుబంధింపబడుట మిక్కిలి వరణీయమైనది. శ్రీ సి. ఆర్. రెడ్డిగారు చెప్పినట్లు చపలమైన చరిత్రదైవము చీలికలుగ జేయనంతవరకు ఉత్తర సర్కారులును, దత్తమండలములును నిజామురాష్ట్రములో నొకభాగమై యుండెను. అవి ఇప్పుడు రాజకీయముగ కలియుటకు వీలులేదు. కాని విద్యా విషయమున కలియుటకు మాత్రము వీలున్నది. వీలున్న ఈ ఐక్యతను మనము ఏల సాధింపరాదు ?

## శే. వడ్డాది సుబ్బరాయకవి.

ఆంధ్రులకు భక్తచింతామణిని ప్రసాదించిన వడ్డాది సుబ్బరాయకవి భౌతిక దేహము గతమాసము 2-వ తేదీని ఆంధ్రుల దృష్టిపథమునుండి తొలగిపోయినది. వీరి మరణమునకు సరిగా ఒకదినమునకు ముందు ఇటాలియన్ కవిగ్రామణి గేబ్రియల్ డి. ఆనన్‌జియో మరణించినాడు. సుబ్బరాయకవి 1854 లో పుట్టినాడు, ఆనన్‌జియో 1864 లో పుట్టినాడు. పదిసంవత్సరములు హెచ్చుతగ్గుగా భూమికిదిగివచ్చిన ఈ కవితాత్మలు రెండింటిలో ఒకటి భారతదేశపు ఇటాలియన్ అనదగిన ఆంధ్రభాషను, మఱియొకటి ఐరోపాదేశపు ఆంధ్రమనదగిన ఇటాలియన్ భాషను మహనీయముగ సేవించి ఇంచుమించు ఒకే కాలమున దివికేగినవి. ఈకవితాత్మలు రెండును పరమ శాంతిని బడయునుగాక !

## ఒంగోలు - ఆంధ్ర పశుసంపద.

పదునాలగవ ఒంగోలు పశుప్రదర్శనమును తెఱచుచు ప్రకాశముమంత్రి ఇట్లు చెప్పెను. 'ప్రచారము లేకపోవుటచే ఒంగోలు పశుపరిశ్రమ క్షీణదశలోనున్నది. ఇటీవల పశువులసంతలు ఢిల్లీ, హరిపురములలో జరిగినవి. అచట ఒంగోలు ఆవులను గురించి ఎద్దులనుగురించి తలపెట్టినవారు లేరు.' ఆంధ్రకీర్తికి పట్టుకొమ్మలయిన వస్తువర్గమునకు చెందిన ఒంగోలు పశువులు మనరాజధానీ నగరమైన ఢిల్లీలో జరిగిన ప్రదర్శనమున కాని, ఈయేటి మన జాతీయమహాసభారంగమైన హరిపురమున జరిగిన ప్రదర్శనమున కాని ప్రదర్శింపబడక పోవుట మిక్కిలి శోచనీయము. ఖండాంతరఖ్యాతిగాంచిన మన ఒంగోలు పశుసంతతి ఇప్పుడిట్లు ఈచపడుట ఆంధ్రుల నేటి దైన్యస్థితికి మఱియొక ఉదాహరణము.

## ఆంధ్రులకు రేడియోస్టేషను లేదు.

భారతదేశమున బ్రాడ్ కాస్టింగు రేడియోస్టేషనుల నిర్మించుటలో భారతప్రభుత్వమువారి దృష్టి ఆంధ్రులమీద, ఆంధ్రనగరములలో నొకటియైన రాజమహేంద్రవరముమీద పడినది. కాని ఇంతలో ఏమి కుంభకోణము జరిగినదో ఆంధ్రులు, వారి రాజమహేంద్రవరము విస్మరింపబడినవి. ఆంధ్రులకు రైళ్లు ఆలస్యముగవచ్చినవి. విద్యాశాలలు ఆలస్య

ముగ వచ్చినవి. ఇందుకు విరుద్ధముగా రేడియోస్టేషను మాత్రము ఏల అందఱితోబాటు రావలయును?

## మఱువరాని గోపాలాచార్యులు.

తమ జన్మదినోత్సవసందర్భమున డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు డి. గోపాలాచార్యులవారి ఆయుర్వేద సేవను ఇట్లు కొనియాడియున్నారు: 'గత 30 సంవత్సరములనుండి పండిత డి. గోపాలాచార్యులు మొదలుగాగల వైద్యవరులు తమ అనుభవమునుబట్టి వమనరేచనాదికర్మలకు కావలసిన వస్తుసముదాయమును పరిశోధించి క్రొత్తరకపు విద్యార్థులకు నవీన శాస్త్రపద్ధతుల నుపదేశించి పాశ్చాత్యవైద్యులవలెనే ఆయుర్వేదవైద్యులుకూడ ఒక్కసూత్రమున నడుచునట్లుచేసిరి.' శ్రీ గోపాలాచార్యులవంటి వైద్యపండితుల ప్రాపునొంది నేటి కింత ప్రాభవమునందిన ఆయుర్వేదమునుకూడ రాజన్‌మంత్రి త్రోసిపారవేయుచున్నాడు. ఆ వైద్యవరులకృషి దీని కింతటి నవీన ప్రాభవమును కూర్చియుండకయే యుండినచో దీనిని ఇట్టిమంత్రులు తమతలపునకే తగలనిచ్చి యుండెడివారుకారేమో! గోపాలాచార్యులు మున్నుగువారి ఆయుర్వేదసేవ ఎంత విలువఅయినదియు, వారికి దేశము ఎంతగ ఋణపడియున్నదియు మన మిప్పుడు సూటిగ తెలిసికొనగలము.

## 'ఆయుర్వేదకళాశాల వలదు.'

మద్రాసులోను, విశాఖపట్టణములోను రెండు మెడికల్‌కాలేజీలు ఉండగా ఇపుడు మదరాసుకాంగ్రెస్ మంత్రివర్గమువారు మదరాసులో మఱియొక మెడికల్ కాలేజీని నిర్మించుటకు ఏర్పాటుకావించుచున్నారు. ఇండియాయందు మఱి యేరాష్ట్రమునను రెండుకంటె హెచ్చు మెడికల్‌కాలేజీలులేవు. పేదరాష్ట్రమగు మదరాసునమాత్ర మేలయుండవలెను? ఈమూడవ అల్లోపతిక్ మెడికల్‌కాలేజీనిర్మాణమునకు బదులు కీల్పాకునందలి గవర్నమెంటు ఇండియన్ మెడికల్‌స్కూలును కళాశాలగమార్చి ఆయుర్వేదమును ఉద్ధరించవలసినదిగి బాధ్యతఎఱిగిన పెద్దలు కొందరు ఆరోగ్యశాఖామాత్యుడైన రాజన్‌ను కోరియున్నారు. అల్లోపతిక్ వైద్యమును వృత్తిగా పెట్టుకొనిన ఆమంత్రి దీనికి అంగీకరింపలేక పోయినాడు. ఆయుర్వేదచికిత్సావిధానమునందలి ఆసవారిష్టములనుకూడ మద్యముక్రింద పరిగణించు విజాతీయ దృష్టిగల ఈకాంగ్రెస్‌మంత్రుల చేతులలో ఆయుర్వేదమునకు మోక్షమేమియు నుండదని తేలిపోయినది.

## ఓరియంటల్‌లైబ్రెరీ స్థానభ్రష్టత

ఈసంవత్సరము జూలై ౧-వ తేదీని ప్రస్తుతము ఎగ్మూరు గవర్నమెంటు మ్యూజియములో ఉంటున్న ఓరియంటల్ లైబ్రెరీ బీచ్ ఒడ్డునఉన్న యూనివర్సిటీ లైబ్రెరీబిల్డింగులోనికి మార్చెదరని శాసనసభలోని ప్రశ్నోత్తరములలో తేలినది. ఈమార్పునకు కారణమోమో తెలియదు. ఓరియంటల్ లైబ్రెరీతో ఆంధ్రులకు విశేషసంబంధము ఉన్నది. మెకంజీదొర ఆంధ్రస్థానికచరిత్రసంపుటములకు, బ్రౌనుదొర సంపాదించిన ఆంధ్రతాళపత్రగంథములకు అది నిక్షేపము. అట్టిదానిని ఇప్పుడు అరవప్రాధాన్యముగల మదరాసు యూనివర్సిటీగ్రంధాలయభవనమున నుంచబోవుటకు కారణమేమి? ప్రస్తుతము ఎగ్మూరులోని దానిభవనము ఇరకటముగలేదే! ఉన్నను ఇప్పుడు మ్యూజియము బిల్డింగులను పెంచుచున్నట్లు దీనినికూడ పెంచవచ్చునే! ఆవరణ కావలసినంతఉన్నదే! ఆ పద్ధతి నవలంబించక ప్రభుత్వమువారు ఈగ్రంధాలయము నిప్పుడు ఆంధ్రయూనివర్సిటి మొదలయిన ఇతర యూనివర్సిటి గ్రాడ్యుయేట్లను మెంబర్లగకూడ నంగీకరింపని మద్రాసుయూనివర్సిటి లైబ్రెరీప్రక్కలో చేర్చుట ఆంధ్రులు హర్షింపజాలనివిషయము. ట్రాము, బస్సు సౌకర్యములులేని క్రొత్తప్రదేశమునకు ఈప్రజాసంస్థను మార్చుట అనాలోచితకృత్య మనక తీరదు.

# ప్రత్యుత్తరం అక్కర లేని ప్రశ్నలు

జనమేజయుడు

టెలిగ్రాములంటే భయం మనకు ఇంకాపోలేదు. బహుశా ఎంతగా పరిచయంఅయినా పోనేపోదని అనుకుంటాను. అయితే ఈభయం కొంతవరకైనా పోడానికి టెలిగ్రాములోని లోపలివిషయాల్ని సూచాయగా కవరు చూసీచూడ్డంలో తెలిసేందుకుగాను శుభవార్తల్ని తెచ్చే టెలిగ్రాములికి ఏదో ఒక నిర్ణీతమైన రంగూ,దుఃఖవార్తల్ని తెచ్చేవానికి వేఱొకనిర్ణీతమైన రంగూ ఎందుకు వాడకూడ్డదు?

... ... ...

మద్రాసుఅసెంబ్లీలో బహిరంగంగా ప్రధానమంత్రి కాంగ్రెస్ మంత్రులకోసం కార్లుకొన్న షాపు యజమానికులం కొనేటప్పుడుగాని, ఇప్పటికికాని తనకు, తనప్రభుత్వానికి తెలియదన్నాడు. ముప్ఫయివేలుపోసి పదికార్లు కొనేటప్పుడు ఈ మాత్రమేనా విచారించకపోవడం సంభవమా? సత్యఋషిగా పేరుపడ్డ గాంధిగారి వియ్యంకులయిన రాజగోపాలాచారిగారు చెప్పవలసిన ముక్కలేనా ఇవ్వి?

... ... ...

స్పీకర్ సాంబమూర్తిగారు విందుభోజనాలకంటె అసెంబ్లీసమావేశ పు పని విలువయిందన్నారు అసెంబ్లీలో అధ్యక్షపీఠాన్నుంచి. అయితే వారు హరిపురకాంగ్రెస్‌కు పోయినప్పుడు వారి తాలూకు వచ్చిన ఒకఫొటోలోనూ వారువిందుభోజనం చేస్తూన్నట్లే రానిచ్చారేమి? స్పీకర్లకి కాంగ్రెసులో విందుభోజనాలకంటే వేరేపని లేకనా? లేక వారికి కాంగ్రెస్‌కంటె విందుభోజనాలే విలువయినవని తోచాయూ?

... ... ...

యుగంధరపత్రిక 'మా ఏలూరిలో కవులంతా ఏమూలనున్నారో' అంటూ అడుగుతూవుంది. మూలనున్న కవుల్ని ముందుకు తీసుకురావడానికి' ఏలూరు యుగంధరుడు వాళ్ళ చెవుల్లో నీళ్ళుపోస్తాడట. నీళ్లుపోసి లేపడం యుగంధరత్వమేనా?

... ... ...

మద్రాసుఅసెంబ్లీలో కె.వి.ఆర్. స్వామిగారు ఆంధ్రరాష్ట్రప్రస్తావన తెస్తే ఆంధ్రుడైన అసెంబ్లీ అధ్యక్షుడు వద్దన్నాడు. ఇంకా విచిత్రం ఏమిటంటే పార్టీశిక్షణాన్ని తప్పి ఆంధ్రరాష్ట్రప్రస్తావన తెచ్చిన స్వామిగార్ని నిరసిస్తూనూ, శిక్షణాన్నితప్పిన స్వామిగార్ని వారించినందుకు స్పీకర్ని అభినందిస్తూనూ ఆంధ్రపత్రిక సంపాదకీయం బనాయించింది, ఆపత్రిక సంపాదకీయంలో ఈవిషయాలు తడవకుండావుండివుంటే ఏమేనా ప్రమాదంవుండేదా?

... ... ...

మద్రాసుఅసెంబ్లీలో మద్రాసును భాషాప్రయుక్తంగా ఆంధ్ర, తమిళ, మళయాళ, కర్ణాటకరాష్ట్రాలుగా విభజించాలని కొండా వెంకటప్పయ్యగారి తీర్మానం. పాతికయేళ్లుగా ఆందోళనచేస్తూ ఆంధ్రరాష్ట్రాన్ని తెచ్చుకోలేని మనం ఇప్పుడు మనతోబాటు తమిళులికి. మళయాళీలకి, కన్నడులికి ప్రత్యేకరాష్ట్రాలు తెచ్చిపెట్టే శక్తిమంతులం అవుతామా? ఆచారిగారి శరగోపంలో అంతమహాత్తుఉందా?

... ... ...

మొన్న మద్రాసులో చిత్రనళీయఫిలిం చూడవచ్చిన ఒకగర్భవతి నెలలు నిండకముందే అకస్మాత్తుగా ప్రసవించి బిడ్డ, తల్లి సుఖంగా వున్నారట. ఈ శుభోదయశకునం ఫిలింవారికా! కవి రామన్నకా? అని జమీందార్‌రైతు అడుగుతోంది. ఈప్రశ్నకు సమాధానం ఒక్క నెల్లూరుజిల్లావాళ్లే ఇవ్వాలా?

... ... ...

అసెంబ్లీలో ఓరుగంటి వెంక[illegible] సుబ్బయ్యగారు పార్టీనాయకులు వద్దన్నా మాట్లాడ్డానికి లేవబోతే కాళేశ్వరరావుగారు ఆయన దగ్గరకువెళ్ళి ఆయన లేవకుండా ఆయన చొక్కాపట్టుకు దిగలాగారనీ ఇల్లా అయిదారుసారులు జరిగిందనీ ఈరభసలో సుబ్బయ్యగారిచొక్కా చిరిగివుంటుందనీ ప్రజాబంధలో కబుర్లపోగు వ్రాస్తున్నాడు. తమ చొక్కా చిరుగువిషయంలో సుబ్బయ్యగారు ఒకస్టేటుమెంట పత్రికలకు ఎందుకు ఇయ్యకూడదు



## ఫిబ్రవరి, 1938

24:—పణముకూల (కర్నూలుజిల్లా): 12-వ శతాబ్దపు నాణెములు దొరికినవి.

27:—రాజమండ్రి. ఆర్ట్సుకాలేజీ పాత విద్యార్థిసంఘ వార్షికోత్సవము. రెవిన్యూమంత్రి ప్రకాశంగారి అధ్యక్షత.

:—మదరాసు. సారథి ఫిలిమ్సు లిమిటెడ్ వారి 'మాలపిల్ల' షూటింగు ప్రారంభోత్సవం. మంత్రి గోపాల రెడ్డిగారి అధ్యక్షత.

28.—మహానంది. ప్రథమ రాయలసీమ వైశ్యమహాసభ. పసుమర్తి వీరభద్రస్వామిగారి అధ్యక్షత.

## మార్చి. 1938

[illegible]:—హైదరాబాదు. సి. ఆర్. రెడ్డిగారి యుస్మానియా యూనివర్సిటీ స్నాతకసభోపన్యాసము.

2:—రాజమండ్రి. భక్తచింతామణి కర్తలు వడ్డాది సుబ్బరాయ కవిగారి నిర్యాణము.

3:—ప్రొద్దుటూరు. కోదండరామస్వామి దేవాలయములోని పూజలకు ఆటంకం కలుగచేయరాదని చందూరు గ్రామంలోని ముసల్మానులపై నేటినుంచి 16-వ తేదీ వరకు 144-వ సెక్షన్.

:—డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి 59-వ జన్మదినోత్సవము ఆంధ్రదేశమునందలి వివిధప్రాంతములందు జయప్రదముగా జరుపబడెను.

4.—మద్రాసు. బారిష్టరు దురిసేటి అప్పారావు పంతులుగారు మద్రాసు హైకోర్టు రిజిష్ట్రారుగా నియమింపబడిరి.

7:—బాపట్ల. చీరాల కాల్పులను గూర్చి ప్రభుత్వవిచారణ ప్రారంభం.

8:—ఆదోని. మొహరం - కామదహనం పండుగుల సందర్భంలో 144-వ సెక్షను.

:—ఒంగోలు. ఎలక్ట్రిక్ పవర్ హౌస్ ప్రారంభోత్సవం ప్రకాశం మంత్రిగారు జరిపిరి.

9:—నెల్లూరు. తిక్కవరపు రామిరెడ్డిగారు, వారి కుమార్తెలు కుమారి శ్యామల, కుమారి లక్ష్మీకాంతం గారలు వాల్తేరు ఆంధ్రవిశ్వవిద్యాలయమందిరనిర్మాణమునకు 25 వేలరూపాయిల విరాళమునిచ్చిరి. వారికి నేటినుండి విశ్వవిద్యాలయం సినేటులో మూడేండ్ల సభ్యత్వం.

12:—సింగరేణి. బొగ్గుగనులలో ఘోర ప్రమాదము. 43 గురి మరణము.

14.—మద్రాసు. ఋణనివారణచట్టానికి వైస్రాయి అంగీకరించినట్లు అసెంబ్లీసభలో ప్రధాని ప్రకటన.

15:—విశాఖపట్టణం, బొబ్బిలి, చికాకోల్ డివిజనల్ బోర్డుల సమ్మేళనానికి ప్రభుత్వంవారి ఉత్తరువు.

17:—మద్రాసు జయాఫిలిమ్సువారి 'కృష్ణజరాసంధ' టాకీ తెలుగుదేశంలో వివిధప్రాంతాలలో విడుదల.

21:—కొత్తకోట (విశాఖపట్టణం జిల్లా) మోదుకూరి చలమేశ్వరరావుగారు తాము కొత్తగా కనిపెట్టిన రాట్నాన్ని మంత్రి గిరిగారి సలహాపైని మహాత్మునకు చూపబోయిరి.

22:—బందరు. మునిసిపాలిటీలో డిఫాల్కేషన్‌కు గుమాస్తా అరెస్టు.

:—ఋణనివారణచట్టము మదరాసు రాజధాని అంతటియందును అమలులోనికి వచ్చింది.

Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher Andra Seshagiri Rao. B.A.